శ్రీరస్తు.

# కవిరాక్షసీయము.

టీకాతాత్పర్యసహితము.

ద్వ్యర్థికావ్యము.

ఇది

గుడిబండ, సుమనస్సరస్వతీవసతిపాఠశాలాధ్యక్షులగు

లోకనాథకవిగారిచే రచియింపఁబడి

ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారివలన

వి. యన్. జూబ్లిముద్రాక్షరశాలయందుముద్రించి

ప్రకటింపఁబడియె.

మద్రాస్.

1902

రిజస్టర్డుకాపీరైట్.

దీనివెల 0 8 0.

# పీఠిక.

ఈ కవిరాక్షసీయమను ద్వ్యర్థి కావ్యమునకు దేటగా తెనుగున టీక వ్రాయవలయునని నామిత్రులగు ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారిచే ప్రేరితుండనై దొరకొంటిని. ఈగ్రంథమున ప్రాయికముగా నుపమాలంకార శ్లేషాలంకారములే నిండియున్నవి. ప్రథమ శ్లోకమున కుపమేయోపమాత్వముసిద్ధించెను. అద్దానిని కువలయానందమున నుపమాప్రకరణమందుదహరించి యుండుటంబట్టి యారీతి కావ్యసమయమునకు భయము గునో? యని వదలినాఁడ. అయినను కొన్ని శ్లోకములకా విధమైన టీకయే వ్రాయబడి యున్నది. సంస్కృత కావ్యములందలి యన్వయ మాంధ్రటీకలం దొకానొకచో సమంజసముగాతోచదు. అట్టి శ్లోకము లనేకము లీకావ్యమందుగలవు. అచ్చో నాయపరాధంబు క్షమింపవలయునని యెన్నెద. ఈకవికి గవిరాక్షసుండని పేరు గలుగుటకు, "సాక్షరేషు భవతీహ జగత్యాం సర్వ ఏవ హృది మత్సరయుక్తః, సాక్షరం కవిజనేషు యదేనం లోక ఏష కవిరాక్షసమాహ" అను శ్లోకమునువక్కాణింతురు. ఇచ్చో నాయభిప్రాయం బీగ్రంథావసానమునకు దెలిపినాఁడను. ఇందెవ్వియైన దోషములుండు నేని పండితులు సవరించి క్షమించెదరని ప్రార్థించెద.

గుడిబండ.
౬—౭—౯౦౨.

ఇట్లు భవద్ధితుడు
శ్రీనివాసపురం, లోకనాథకవి
సుమనస్సరస్వతీవసతి పాఠశాలాధ్యక్షః.

శ్రీరస్తు.

# కవిరాక్షసీయము.

టీకాతాత్పర్యసహితము.

శ్లో. గుణదోషౌబుధోగృహ్ణ న్నిందుక్ష్వేళావివేశ్వరః,
శిరసాశ్లాఘతేపూర్వం పరంకంఠేనియచ్ఛతి. ౧.
ప్రణమ్యలోకనాథోహం పార్వతీప్రాణవల్లభమ్,
టీకామాంధ్రాత్మికాం కుర్వే కవిరాక్షససత్కృతేః.

(కవిస్వాహంకారమును పరిహరించువాఁడై చెప్పుచున్నాఁడు.)

టీక. బుధః=పండితుఁడు, గుణదోషౌ= గుణదోషములరెంటిని, ఈశ్వరః = పరమేశ్వరుఁడు, ఇందుక్ష్వేళావివ = చంద్రవిషములనువలెనే, గృహ్ణన్ = గ్రహియించినవాఁడై, పూర్వం= మొదటిదియగు గుణమును, శిరసా=తలచేత, శ్లాఘతే = కొనియాడుచున్నాఁడు. పరం = వెనుకటిదియగు దోషమును, కంఠే= కుత్తుకయందే, నియచ్ఛతి=నిలుపుచున్నాఁడు.

అర్థాంతరము. ఈశ్వరః= పరమేశ్వరుఁడు, ఇందుక్ష్వేళౌ=చంద్రునిన్ విషమునున్, బుధః=విద్వాంసుఁడు, గుణదోషావివ=గుణదోషములనువలె, గృహ్ణన్= తీసికొనినవాఁడై, పూర్వం=మొదటివాఁడగుచంద్రుని, శిరసా=శీర్షముచేత, శ్లాఘతే = కొనియాడుచున్నాఁడు. పరం = వెనుకటిదియగు విషమును, కంఠే = గొంతునందు, నియచ్ఛతి = నిలుపుచున్నాఁడు.

తాత్పర్యము. పాలసముద్రమునుఁ దరుచునెడ నందు పుట్టిన చందురుని విషమును బరమేశ్వరుఁడు పరిగ్రహించి చంద్రుని దలయందు భూషణముగానుంచికొని విషమును వెలిబఱచక యేతీరున తనకంఠమందే నిలిపికొనియెనో అప్పగిది నేర్పరియగు

వాఁడు కావ్యములందు సౌకుమార్యమాధుర్యప్రసాదాది గుణములనుఁ అప్రయుక్త క్లిష్టా
దికావ్యదోషములనుఁ దెలిసినవాఁడై గుణములను శిరఃకంపనపూర్వకముగా పొగడుచు
న్నాఁడనియు, దోషములను వెలిబఱచక కంఠమందే యణచుకొను చున్నాఁడనియు
దెలియవలయును. ఇట్లనుటచే గవియు బ్రమాదవశమున నెందేని యప్రయుక్తాదికావ్య
ములను బ్రయోగించియున్నచో దానిఁ గన్న విద్వాంసుఁడట్టిదోషములను చాటింపక
గుణములనే గ్రహింపవలయుననియు, తాను తప్పులులేక కావ్యమును జెప్పువాఁడను
నహంకారమును జెప్పక లేనతప్పులను మన్నింపవలయుననియు, పరమేశ్వరుని యుపమాన
పూర్వకముగా జెప్పి పండితులను బ్రార్థించుచున్నాఁడు. ౧.

శ్లో॥ శబ్దశక్త్యైవకుర్వాణా సర్వదానవనిర్వృతిమ్,
కావ్యవిద్యాశ్రుతిగతా స్యాన్మృతస్యాపిజీవనీ. ౨.

(ఇప్పుడు సత్కావ్యప్రశంసాముఖముగా కావ్యమును బ్రశంసించుచున్నాడు)

టీ. శబ్దశక్త్యైవ-శబ్ద=శబ్దములయొక్క, శక్త్యైవ=చెప్పఁదగిన యర్థములను
జెప్పెడిసామర్థ్యముచేతనే, సర్వదా=ఎప్పుడును, నవనిర్వృతిం = నూతనసుఖమును,
కుర్వాణా=చేయుచుండెడి, కావ్యవిద్యా= గుణాలంకారసహితంబై యప్రయుక్తాది
దోషరహితంబైన కవిత్వవిద్య, శ్రుతిగతా = చెవికివినబడినదియై, మృతస్యాఽపి=
మూఢునకుఁగూడ (ఇందు మృతశబ్దము పచారవృత్తిచే మూఢునిపరంబగును) జీవనీ=జీవ
ముగలుగజేయునది, స్యాత్ = అగును, (అనగా సంతసింపజేయునదియగును).

అర్థాంతరము. శబ్దశక్త్యైవ, శబ్ద=ఉచ్చారణముయొక్క, శక్త్యైవ = మహి
మకారణముచేతనే, సర్వదానవనిర్వృతిం—సర్వదానవ = సమస్తరాక్షసులయొక్క,
నిర్వృతిం=మరలబ్రతికించుటయనెడి సౌఖ్యమును, కుర్వాణా = చేయుచుండెడి,
కావ్యవిద్యా - కావ్య = శుక్రునియొక్క, (శుక్రోదైత్యగురుఃకావ్య అనియమరము)
విద్యా=సంజీవినీవిద్య, శ్రుతిగతా=చెవినిబొందినదియై, మృతస్యాఽపి=చచ్చినరక్క
సులబలమునకుఁగూడ, జీవనీ=జీవంబొసంగునది, స్యాత్=అగును.

తా. రాక్షసులకు గురువగు శుక్రాచార్యుఁడు ఏలాగున తనసంజీవినీవిద్య
యొక్క యుచ్చారణమాత్రముచేతనే యుద్ధమందు మృతులగు దైత్యులను జీవింపఁజే
యుచు వారికి నూతన సుఖమునుగలుగఁజేయునో యాలాగుననే కవిత్వము చెప్పెడి

పండితుఁడు తనశబ్దశక్తిచేత నూతన సుఖములను గలుగజేయుచు వినికిచేతనే మృతప్రాయులగు మూఢులకుఁగూడా సంతోషమునొనర్చును.

మరియు పూర్వము శుక్రుఁడు మృతసంజీవినియను నొకవిద్యను నేర్చుకొని యందుచే మృతులగు దైత్యులను బ్రతికించుచుండగ దేవతలావిద్యను గ్రహించుటకు బృహస్పతి సుతుడగు కచుండనువాని శుక్రునియొద్దకు బంపఁగా నతఁడు గురువునారాధించి యావిద్యను బడసెనని భారతమున నాదిపర్వమున జెప్పంబడినది. ఈ విద్య కేవల మంత్రోచ్చారణముగను మంత్రపూతమగు నౌషధముగను ప్రయోగించుటచేతను సిద్ధించును. ఇదియు గాయత్రీమంత్రగర్భితంబగు మృత్యుంజయమంత్రమై యొప్పియున్నది. దీని విధానంబు కౌతుకరత్నభాండాగారంబను గ్రంథమున ౩౦౭ - ౩౦౯ పుటములందును, రసరత్నాకర మంత్రఖండమందును జూడందగును. ౨.

శ్లో. కల్యాణవర్ణపదతాం వాగ్విద్యుదివబిభ్రతీ,
అభ్రాంతేషు సదాసార సంగిషుస్యాత్స్ఫురద్గుణా. ౩.

(కావ్యంబుసుందరమనుట వివేకులయందవెల్గుననిజెప్పుచున్నాడు.)

టీ. కల్యాణవర్ణపదతాం-కల్యాణ= శుభములైన, వర్ణ = అక్షరములుగల. పదతాం = పదములభావమును, బిభ్రతీ=వహించుచుండెడి, వాక్ = కావ్యమందలి, పలుకు, సదా=ఎల్లపుడు, సారసంగిషు=గుణగ్రాహకులగు, అభ్రాంతేషు=భ్రాంతులు కానివారి (వివేకుల) విషయమందు, స్ఫురద్గుణా - స్ఫురత్ = వెలుగుచుండెడి, గుణా =శ్లేషాదిగుణములుగలదియై, విద్యుత్ =మెఱుమువలె, స్యాత్ =ప్రకాశించుచుండును.

అర్థాంతరము. కల్యాణవర్ణపదతాం - కల్యాణవర్ణ = బంగరువన్నెయొక్క, పదతాం = ఆశ్రయభావమును, బిభ్రత్ = భరించుచున్నదియై, సదాసారసంగిషు = శ్రేష్ఠములగు జల్లులనుబొందియుండెడి, అభ్రాంతేషు=మేఘములందు, స్ఫురద్గుణా- స్ఫురత్ = ప్రకాశించుచుండు, గుణా= పచ్చవన్నెగల, విద్యుత్ = మెఱుమువలె, స్యాత్ = ప్రకాశించుచుండును.

తా. బంగరువన్నెల దురంగలించు మెఱుంగుతీవెలు మేఘములపై నెప్పగిది పచ్చనిరంగులచే వెలుంగుచుండునో అప్పుడువున మంచియక్షరంబుల పదంబులతోఁ గూడిన సత్కావ్యములు ఎల్లపుడు గుణగ్రాహకులగు వివేకులయందు శ్లేషప్రసాదమాధుర్యాది గుణములతోఁ గూడినవియై ప్రకాశించును. ౩.

శ్లో. గూఢభావాస్పదత్వేన యదనాదేయవద్భవేత్,
సారస్వతామృతం సర్వే కవయ స్తన్న జానతే. ౪.

(ఇపుడు వివేకు లనేకులు గలుగుటలేదని జెప్పుచున్నాడు.)

టీ. యత్ = ఏ, సారస్వతామృతం - సారస్వత = సరస్వతీసంబంధమైన, అమృతం=కావ్యామృతము, గూఢ=రహస్యమైన, భావ=అభిప్రాయమునకు, ఆస్పదత్వేన = ఆశ్రయమగుటచే, అనాదేయవత్=గ్రహింపఁగూడనియట్లు, భవేత్ = అగునో, తత్=ఆసారస్వతామృతమును, కవయః = విద్వాంసులు, సర్వే = అందఱు, నజానతే=తెలియరు.

అర్థాంతరము. యత్ = ఏ, సారస్వతామృతం= సరస్వతీనదీసంబంధమైన నీరు, గూఢభావాస్పదత్వేన - గూఢభావ = రహస్యముగాలోపల నే ప్రవహించుచు బైగనుపింపకుండుటకు, ఆస్పదత్వేన = ఆధారమగుటచే, అనాదేయవత్=నదీ సంబంధముకానిదివలె భేవేత్=అగునో, తత్=అట్టి సరస్వతీనదీజలమును, సర్వేకవయః= అన్ని జలపక్షులు, నజానతే = తెలియజాలవు.

తా. గుప్తగామినియైన సరస్వతీనదియొక్క జలమును కొంగలు మొదలగునన్ని జలపక్షులు దెలిసికొనక హంసలు మొదలగు కొన్నిమాత్రమేరీతి దెలిసికొనుచున్నవో యవ్విధమున గూఢములైన రసభావాదులను శ్లేషాదిగుణములుగల కావ్యామృతమును సామాన్యవిద్వాంసులందఱు దెలిసికొనరనియుచక్కనిపండితులుకొందరుమాత్రమే తెలిసికొందురనియుభావము. అనగా రహస్యమైనశ్లేషాదిగుణములుగల నాకావ్యముసామాన్యపండితులకు దెలియదనుట. ఇచట సరస్వతీనది యన్నినదులవలె ప్రవహింపక గంగా యమునలలో నంతర్భూతమై ప్రవహించుచున్నదని పురాణప్రసిద్ధము. ౪.

శ్లో. స ఏవ కేవలః కర్ణః శ్రేయానంగేషుగణ్యతే,
యఃకుండలస్యవహనాత్త్యాగేనైవప్రకాశతే. ౫.

(విద్వాంసులనేకులుండినను దాతలట్లుండరని జెప్పుచున్నాఁడు.)

టీ. యః = ఎవఁడు, కుండలస్య = సూర్యదత్త కర్ణాభరణముయొక్క, వహనాత్ =ధారణమువలన, ప్రకాశతే=శత్రువిజయముచే వెలుంగునో, త్యాగేన = విడుచుటచేత, నైవప్రకాశతే=ప్రకాశింపఁడో, (లేక, కుండలస్యవహనాత్ =కర్ణభూ

షణధారణమునకంటె, త్యాగేనైవ=దానినివిడుచుటచేతనే, ప్రకాశతే=వెలుగుచున్నవాఁడో, సః=అట్టి, కేవలః=ఒకఁడైన, శ్రేయాన్=ఔదార్యముచేశ్రేష్ఠుఁడైన, కర్ణఏవ=కర్ణుఁడే, అంగేషు=అంగదేశమందు, గణ్యతే=ఎన్నబడుచున్నాఁడు.

అర్థాంతరము. యః=ఏచెవి, కుండలస్య=కర్ణాభరణముయొక్క, వహనాత్=ధారణమువలన, ప్రకాశతే=వెలుగుచున్నదియో, త్యాగేసతి=విడువగా, నైవప్రకాశతే=వెలయదో, సః=అట్టి, కేవలః=ముఖ్యమైన, కర్ణఏవ=చెవియే, అంగేషు=అవయవముల మధ్యమందు, ప్రకాశతే=వెలుగుచున్నది.

తా. సకల శరీరావయవములును జెవిపోగులవలననెట్లు మిక్కిలి ప్రకాశించుచున్నదో, యవ్విధమున దాతలగువారనేకులుండినను దాను జనించినపుడు సూర్యునిచే నియ్యబడిన సహజములైన కవచకుండలములుగల కర్ణుడు ఇంద్రునిచే యాచింపఁబడినవాఁడై తనకు జయమునొసంగుచు నలంకారమైయుండు కర్ణకుండలములను ఇంద్రునికి దానముచేసిన యారాధేయుడొకడే అంగదేశమందు ప్రసిద్ధుడైనవాడు.

పూర్వమున పాండురాజపత్నియైన కుంతిదేవి తనచిన్ననాఁడు దుర్వాసుఁడను మునినారాధించుచు ప్రసన్నుఁడగు నామునివలన నొకమంత్రమునుబడసి యామంత్రమహిమ నెఱుంగవేడి సూర్యునిన్ బిలిచిన నాతఁడాయమ్మకోర్కె నెరవేర్పగా గర్భిణియైన యాకుంతి సిగ్గుచేతను భయముచేతను తాఁగనినశిశువును నదియందుపారవైచినంత సూర్యదత్తకవచకుండలములచే వెలింగెడి యక్కుమారుడు సూతుడనువానిచే జిక్కి రాధయను నతనిభార్యకుపుత్రుడై రాధేయుడనన్ బరగి దుర్యోధనునింటఁ బెరిగి యర్జునునకు విరోధియైనందున నింద్రుడు తనకొమరుడగు నర్జునునకు శుభముకలుగుటకై జయప్రదమైన యాకుండలములను వేడినప్పుడు దానినిచ్చుటచే కర్ణునకు మహాదాతయనుపేరు గలిగెనని భారతకథను దెలియవలయును. ౫.

శ్లో. వసన్నప్యవదాతానాం ద్విజానాంసవిధేసదా,
రాగానుబంధమధరో నకదాచిద్విముంచతి. ౬.

టీ. అధరః=నీచుఁడు, అవదాతానాం=పరిశుద్ధులైన, ద్విజానాం=బ్రాహ్మణక్షత్రియవైశ్యులయొక్క, సవిధే=సమీపమందు, సదా=ఎపుడును, వసన్నపి=ఉండువాఁడైనను, కదాచిత్=ఒకానొకప్పుడును, రాగానుబంధం=విషయాసక్తిసంబంధమును, నవిముంచతి=విడువడు,

అర్థాంతరము. అధరః=పెదవి, అవదాతానాం=తెల్లనైన, ద్విజానాం=దంతములయొక్క, సవిధే=చెంగట, సదా=ఎప్పుడును, వసన్నపి = ఉండునదియైనను, రాగానుబంధం=ఎఱ్ఱదనముతోటిసంబంధమును, కదాచిత్ = ఒకానొకప్పుడును, నవిముంచతి=విడువదు.

తా. నీచుడగువాడు పరిశుద్ధులైనబ్రాహ్మణాదుల సమీపమందుసదావాసముచేయుచునుండినను తెలుపువన్నెగల పండ్లసమీపమందుండు పెదవి యెవ్విధమున దన యెఱ్ఱదనమును విడువదో అవ్విధమున దనవిషయాసక్తినివిడువజాలడు. ఇట్లనుటచే సహవాసమువలన గుణములు వేరగుననుమాటయబద్ధమనియు స్వభావగుణము నెప్పుడు విడువడనియుభావము. ౬.

శ్లో. అలకాశ్చఖలాశ్చైవ మూర్ధ్నిభీరుజనైర్ధృతాః,
ఉపర్యుపరిసత్కారే ప్యావిష్కుర్వంతివక్రతాం. ౭.

టీ. భీరుజనైః=స్త్రీజనులచే, మూర్ధ్ని=శిరస్సునందు, ధృతాః = ధరింపబడిన, అలకాశ్చ=ముంగురులును, ఉపర్యుపరి=పైపైన, సత్కారేఽపి = తైలాదులచేనుపచారము లు గలుగుచుండినను, వక్రతాం=వంకరదనమును, ఆవిష్కుర్వంతి=గలుగజేయుచున్నవి.

అర్థాంతరము, ఖలాశ్చ = దుర్జనులును, భీరుజనైః = భయపడెడిజనములచేత మూర్ధ్ని=శిరస్సునందు, ధృతాఅపి= ధరింపబడినవారైనను, ఉపర్యుపరి = పైపైన, సత్కారేఽపి=ధనాదులచే నుపచారము గలుగుచుండినను, వక్రతాం = దుష్టభావమును, ఆవిష్కుర్వంతి=ప్రకటించుచున్నారు.

తా. చెలులచేత నూనె మొదలగువానిచే నుపచరింపబడిన తలయందలి ముంగురులేలాగు దమవక్రభావమునువిడువవో అట్లే దుష్టులగువారు భయపడువారిచే నమస్కరింపబడినవారై ధనాదులచే నాదరింపబడినవారైనను తమస్వభావమగు దౌర్జన్యమును మానరు. ౭.

శ్లో. గుణానార్తింపరాంనీత్వా ధనినోధన్వినోయథా,
నిఘ్నంతిహృదయందృప్తా విషమాంవిద్విషామివ. ౮.

టీ. ధనినః=ధనముగలవారు, దృప్తాఃసంతః=గర్వించినవారై, గుణాన్=వినయాదిగుణములను, పరాం=హెచ్చైన, ఆర్తిం=పీడను, నీత్వా=పొందించి, ధన్వినో

యథా=విలుకాండ్రవలె, విదుషాం=విద్వాంసుల, హృదయం=మనసును, విద్విషాం = శత్రువులయొక్క, హృదయమివ=ఎదనువలె, నిఘ్నంతి=తల్లడింప జేయుచున్నారు.

అర్థాంతరము. ధన్వినః=విలుకాండ్రు, దృప్తాస్సంతః=రణలాభముచే హర్షము గలవారై, గుణాన్=అల్లెత్రాళ్లను, పరాం=శ్రేష్ఠమైన, ఆర్తిం=వింటికొప్పును, నీత్వా=పొందించి, ధనినోయథా=ధనవంతులువలె, విద్విషాం=శత్రువులయొక్క, హృదయం=ఎదను, విదుషాం=విద్వాంసులయొక్క, హృదయమివ=మనస్సునువలె, నిఘ్నంతి=కొట్టుచున్నారు.

తా. యుద్ధాపేక్షగల విలుకాండ్రు తమధనుస్సుల కొప్పులందు అల్లెత్రాళ్లను బొందించి శత్రువులహృదయములను భేదించునటువలె, ధనవంతులు గర్వించినవారై వినయాదిసద్గుణములను నశింపజేసి విద్వాంసుల మనస్సులను వ్యథపరచుచున్నారు. ౮.

శ్లో. కృపాణేనకథంకారం కృపణస్సహగణ్యతే,
పరేషాందానసమయే యస్స్వకోశంవిముంచతి. ౯.

టి. యః=ఏకృపాణము (కత్తి) పరేషాం=ఇతరులయొక్క, దానసమయే = విదారణసమయమునందు, స్వకోశం = తనయొరను, విముంచతి = విడుచుచున్నదో (అట్టికత్తి) పరేషాం=ఇతరులకు, దానసమయే=ఇచ్చెడివేళలో, స్వకోశం=తనధనసముదాయమును ఇయ్యని, కృపణః = లోభి, కృపాణేన=కత్తితోడ, కథంకారం=ఎవ్విధమున, గణ్యతే=ఎన్నబడును, (అనగా గౌరవింపఁబడడు.)

తా. పరులను ఖండించుసమయమందు తనకోశమును(యొరను)విడుచుచుండు కృపాణము (కత్తి) తోడ, పరదాన సమయమందు తనకోశమును (లిబ్బిని) వదలని కృపణుడు (లోభి), సరిగాడు. ప్రాణనాశకమైన కత్తికంటె లోభివాడు నీచుడు.

శ్లో. దృఢతరనిబద్ధముష్టేః కోశనిషణ్ణస్యసహజమలినస్య,
కృపణస్యకృపాణస్యచ కేవలమాకారతోభేదః. అని గ్రంథాంతరము. ౯.

శ్లో. మూర్ఖాశ్చముకురాశ్చైవ భృశంభూత్యవలేపినః,
పరేషాననురూపాణి విపర్యాసేనగృహ్ణతే. ౧౦.

టీ. మూర్ఖాః=తెలియనివారు, భృశం=మిక్కిలి, భూత్యవలేపినః, భూతి = సంపదచేత, అవలేపినః=గర్వముగలవారై, పరేషాం=ఇతరులయొక్క, రూపాణి=స్వభావములను, విపర్యాసేన=వ్యత్యాసముచేత, గృహ్ణతేనను = అవశ్యకముగాదెలియుచున్నారు.

అర్థాంతరము. ముకురాశ్చ=అద్దములును, భృశం=మిక్కిలి, భూత్యవలేపినః=భూతి=భస్మముచేత, అవలేపినః=పూతగలవియై, పరేషాం= ఇతరుల, రూపాణి=ఆకారములను, విపర్యాసేన=వ్యత్యాసముచేత, గృహ్ణతేనను=గ్రహించుచున్నవిగదా.

తా. గాజుబిల్లలు భస్మముమొదలగువానిచే పూయబడినవియై ఇతరుల యాకారములను దారుమారుగా నెట్లు గ్రహించుచున్నవో యవ్విధమున మూర్ఖులగువారు ఐశ్వర్యమదముగలవారై పరులసుగుణములను దుర్గుణములుగా భావింతురు. ౧౦.

శ్లో. జాడ్యంహ్రీమతిగణ్యతేవ్రతశుచౌ దంభశ్శుచౌకైతవం,
శూరేనిర్ఘృణతామునౌ విమతితాదైన్యంప్రియాలాపినీ,
తేజస్విన్యవలిప్తతా ముఖరతావక్తర్యశక్తిస్థిరే,
తత్కోనామగుణోభ వేత్సుగుణినాం యోదుర్జనైర్నాంకితః.

ఇట దీని ననుసంధింపవలయును.

శ్లో. మధువ్రతాశ్చమూర్ఖాశ్చ రజసారూక్షతాంగతాః,
నిత్యమాక్రమ్యగృహ్ణంతి సారంసుమనసాంముఖాత్. ౧౧.

టీ. మనువ్రతాః=తుమ్మెదలు, రజసా=పుప్పొడిచేత, రూక్షతాం = కాఠిన్యమును, గతాః=పొందినవియై, నిత్యం=ప్రతిదినమందును, ఆక్రమ్య= పుష్పములందుండి, సుమనసాం=పుష్పములయొక్క, ముఖాత్=కొనలనుండి, సారః = స్థిరాంశభూతమైన తేనెను, గృహ్ణంతి = అంగీకరించుచున్నవి.

అర్థాంతరము. మూర్ఖాశ్చ=మూర్ఖులును, రజసా = రజోగుణరూపమైన గర్వముచే, రూక్షతాం=ఆస్నేహభావమును,గతాః=పొందినవారై, నిత్యం=ఎపుడును, ఆక్రమ్య=విద్వాంసులనాక్షేపించి,సమనసాం=పండితులయొక్క,ముఖాత్=సమీపమువలననుండి, సారం=శ్రేష్ఠమైనయర్థమును, గృహ్ణంతి=తెలియుచున్నారు.

తా. తుమ్మెదలు పుప్పొడిచే మృదుత్వమునువదలి పూవులందును వానియగ్రములవలననుండి పూదేనెనెట్లు గ్రహించుచున్నవియో యాలాగుననే మూర్ఖులగువారు గర్వముచే విద్వాంసులనాక్షేపించుచు వారిదగ్గరనుండిసరియైనయర్థములను గ్రహించుచున్నారనిభావము. ౧౧.

శ్లో. ద్విజేంద్రోఽపికలాఢ్యోఽపి కామచారీభవంత్సదా,
నిత్యంనిమజ్జన్నప్యబ్ధౌ నాంతశ్శుద్ధోభవత్యలం. ౧౨.

టీ. సదా=ఎల్లపుడును, కామచారీభవన్ = విచ్చలవిడిదిరుగువాడు, ద్విజేంద్రోఽపి=బ్రాహ్మణశ్రేష్ఠుడైనను, కలాఢ్యోఽపి=విద్వాంసుడైనను, నిత్యం=నియత

ముగా, అబ్ధౌ=సముద్రమందును నదిమొదలగువానియందును, నిమజ్జన్నపి=స్నానము జేయువాడైనను, అంతః=మనసున, అలం=మిక్కిలి, శుద్ధః=పవిత్రుడు, నభవతి=కాడు.

అర్థాంతరము. సదా=ఎప్పుడును, కామచారీ=అడ్డములేని గమనముగలవాడు, భవన్=అగుచు, కలాఢ్యోఽపి - కలా=పదియాఱుకళలచే, ఆఢ్యోఽపి=సంపూర్ణకిరణములుగలవాడైనను, ద్విజేంద్రోఽపి-ద్విజ=బ్రాహ్మణులకు, ఇంద్రోఽపి=పౌర్ణమాసాది యజ్ఞకారణముచే రాజైనను (సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ంరాజా అను శ్రుతిచే చంద్రుడు బ్రాహ్మణులకు దొరయని తెలియవలయును) నిత్యం=నియతముగా, అబ్ధౌ=సముద్రమందు, నిమజ్జన్నపి=అస్తమయకాలమందు మునుగువాడైనను, అంతః=బింబమధ్యమందు, అలం=మిక్కిలి, శుద్ధః=నిర్మలమైనవాడు, నభవతి=కాడు.

తా. బ్రాహ్మణుడైనను సకలశాస్త్రములను దెలిసినవాడైనను వ్రతములాచరించుచు తీర్థములందు స్నానము జేయువాడైనను విచ్చలవిడిదిరుగుచుండెనేని, బ్రాహ్మణాధిపతియై యడ్డములేనిగమనముగలవాడై సంపూర్ణకలలతోగూడినవాడై యస్తమయకాలమందు సముద్రమందుమునుగుచుండెడిచంద్రునికి యొదయం బెవ్విధమున కందునోచుచున్నదియో యవ్విధమున స్వేచ్ఛాచారియగువానికి చిత్తము పరిశుద్ధముగానుండదు ౧౨.

శ్లో. మహాప్రభంజనంప్రాప్య స్వాంతేషుకలుషీకృతాః,
ప్రతికూలంవిచేష్టంతే నీచాః కేఽపిజడాశయాః. ౧౩.

టీ. జడాశయాః=మందబుద్ధిగల, నీచాః=దుర్జనులు, మహాప్రభం = హెచ్చైనతేజస్సుగల, జనం=రాజుమొదలగుజనమును, ప్రాప్య=పొంది, స్వాంతేషు=మనస్సులందు, కలుషీకృతాః=పాపబుద్ధిగలవారై, ప్రతికూలం = అనుకూలముకానట్టుగా, విచేష్టంతే=వ్యాపించుచున్నారు.

అర్థాంతరము. నీచాః=అల్పములైన, కేఽపి=కొన్ని, జలాశయాః=చెఱువులుమొదలగునవి, (డలలకభేదముగనుక జడయనుచోట జలయని దెలియవలయును) మహాప్రభంజనం=పెద్దగాలిని, ప్రాప్య=పొంది, స్వాంతేషు=తమమధ్యభాగములందు, కలుషీకృతాః = కలగుడుగలవియై, కూలం = గట్టునుగుఱించి, విచేష్టంతే = వచ్చుచున్నవి.

తా. అల్పములగు చెఱువులు మొదలగునవి పెద్దగాలి సోకుటచేత మధ్యభాగములందు కలుషితములై దరుల నెవ్విధమున వ్యాపించుచున్నవో యవ్విధమున నీచులగువారు తేజస్సుగలరాజు మొదలగువారి యాశ్రయము సంపాదించి యందుచే గర్వితులై సాధువులగువారికి ప్రతికూలముగా ప్రవర్తింతురు. ౧౩.

శ్లో. దత్వావారంజనాయస్వం దిక్షుగర్జంతియేముహుః,
తానుత్సేకవతఃప్రాప్య నందంతినవనీపకాః. ౧౪.

టీ. యే=యేదాతలు, దిక్షు=దిక్కులందుండు, జనాయ = యాచకజనమునకు, అవారం యథాతథా=తొందరలేనట్టుగా, స్వం=ధనమును, దత్వా=ఒసగి, ముహుః=పలుమారు, గర్జంతి=బెదరించుచున్నారో, ఉత్సేకవతః=గర్వముగల, తాన్ = ఆదాతలను, ప్రాప్య=దగ్గరి, వనీపకాః=యాచకులు, ననందంతి=సంతసించరు.

అర్థాంతరము. యే=యే మేఘములు, జనాయ=జనములకొఱకు (బ్రతుకుకొఱకు) స్వం=తనసంబంధమైన, వారం=నీరును, దత్వా=యిచ్చి, దిక్షు = దిక్కులందు, ముహుః=మాటిమాటికి, గర్జంతి=ఉరుముచున్నవో, ఉత్సేకవతః=వర్షముగల, తాన్=ఆ మేఘములను, ప్రాప్య=పొంది, నవనీపకాః=క్రొత్తకడపపుష్పములు, నందంతి=పూచుచున్నవి.

తా. దాతలగువారు తొందరలేనట్టుగా యాచకులకు తమద్రవ్యము నొసంగి తమకులోబడిన యాయాచకులను పరుషవాక్కులచే బెదిరించినచో యాచకులు వారి దగ్గరచేరి సంతసింపరు; అనగా దానమిచ్చిన పిదప బెదరించరాదనిభావము.

మేఘములు విఘ్నములేకవర్షించి తమజలమును జనులబ్రతుకకైయిచ్చి గర్జించినచోకడపపుష్పములు పుష్పించును. కడపచెట్లు వానకాలమందు పుష్పించుచున్నవని కవిసమయసిద్ధము. ౧౪.

శ్లో. నిత్యమక్షిగతస్యాపి దుర్జనస్యాంజనస్యచ,
నలక్షయితుమాకార శ్శక్యస్స్వానుప్రవేశతః. ౧౫.

టీ. నిత్యం=ఎల్లప్పుడును, అక్షిగతస్య=దృష్టివిషయమునుబొందిన, దుర్జనస్య=నీచునియొక్క లేక (అక్షిగతస్య=ద్వేషింపదగిన, దుర్జనస్య=దుష్టునియొక్క,) ఆకారః=ఆకృతి, లేక (వ్యాపారము,) లక్షయితుం=తెలియుటకు, నశక్యః=సాధ్యకాదు (అథవా=స్వానుప్రవేశతః=స్వ=తనవారియందు, అనుప్రవేశతః=వెంబడించుటవలన తెలియుటకు సాధ్యముకాదు.)

అర్థాంతరము. నిత్యం=ఎల్లకాలమును, అక్షిగతస్య=స్త్రీలకంటినిబొందిన, అంజనస్య=కాటుకయొక్క, ఆకారః=స్వరూపము, స్వానుప్రవేశతః-స్వ=తననేత్రములయొక్క, అనుప్రవేశతః=ప్రవేశకారణమువలన, లక్షయితుం=చూచుటకు, నశక్యః=సాధ్యముకాదు.

తా. నిత్యము స్త్రీలకన్నులలోనుంచబడు కాటుక యెవ్విధమున ఆ స్త్రీలకంటికి కానబడదో యట్లు కంటికెదురగనుండి ద్వేషింపదగిన నీచుని ద్రోహవ్యాపారమును గనుగొనుటకు శక్యముకాదు. కంటిచే నెదురుగనుండు పదార్థములను చూచుటకు సాధ్యమగునట్లు ఆకంటియందుండు వస్తువునుజూచుటకు కాదనునది ప్రసిద్ధము. తనకు మిత్రునివలె కనబడుచు నంతరంగమందు ద్రోహముచేయువారిని గాంచుటకు పరముగాదనుట.                                                    ౧౫.

శ్లో. లక్షయిత్వైవలుబ్ధేశాః కించిద్రూపంభయాపహం,
మార్గణానాంప్రవర్తంతే క్షేపాయానపరాధినాం.                                                    ౧౬.

టీ. లుబ్ధేశాః=లోభులగుదొరలు, మార్గణానాం=యాచకులయొక్క, భయాపహం=భయమునుబోగొట్టునట్టి, రూపం=సౌమ్యాకారమును, కించిత్=కొంచెముగా, లక్షయిత్వైవ=చూపించియే, అనపరాధినాం=అపరాధులుకానియట్టి, మార్గణానాం=యాచకులయొక్క, క్షేపాయ=ఆక్షేపములకు, ప్రవర్తంతే=ఉద్యమించుచున్నారు.

అర్థాంతరము. లుబ్ధేశాః=శ్రేష్ఠులైన వేటకాండ్రు, భయాపహం=భయమును బోగొట్టెడి, కించిద్రూపం = ఆవులు మొదలగువానిచే కప్పబడిన తమయాకారమును, లక్షయిత్వా=కనబఱచి, అనపరాధినాం=లక్ష్యములను (గుఱిని) ఛేదించునట్టి,మార్గణానాం=అంబులయొక్క, క్షేపాయ=విడుచుటకు, ప్రవర్తంతే=తొడగుదురు.

తా. వేటకాండ్రగు బోయలు మృగములనుజంపుటకై యాకులు మొదలగువానిచేత తమయాకారమును మఱుగుపఱచిగుఱిపెట్టి మృగములకై యమ్ములనేయువిధమున లోభులగు రాజులు యాచకులభయము నపహరించునట్టి సుందరాకారమును గనఁబఱచి అపరాధులుకానట్టి యాచకుల నాక్షేపింతురు.                                                    ౧౬.

శ్లో. నీతోఽప్యభ్యంతరత్వేన జనైః ప్రాణసమానతాం,
ఖలో వాయురివాహోపో దుర్గ్రహస్స్పర్శనంవినా.                                                    ౧౭.

టీ. అభ్యంతరత్వేన=లోపలనుండు కారణముచే, జనైః=సాధుజనులచేత, ప్రాణసమానతాం=ప్రాణములతో సమానభావమును, నీతోఽపి=పొందింపబడినవాఁడైనను ఖలః=నీచుడు, స్పర్శనంవినా=దానమునువిడిచి, అహోపః=దుష్టస్వభావముగలవాఁడై, దుర్గ్రహః=తెలిసికొనదగని వాడుగనున్నాడు.

అర్థాంతరము. అభ్యంతరత్వేన=శరీరములోపలనుండు కారణముచే, జనైః=మనుష్యులచేత,ప్రాణసమానతాం=ప్రాణవాయువుయొక్క యము సమానవాయువుయొక్క

యుభావమును, నీతోపి=పొందింపబడినదియైనను, అరూపః=రూపము లేనిదియై, స్పర్శనం వినా=స్పృశించుగుణమునువిడిచిన, వాయురివ=గాలివలెనే, దుర్గ్రాహః=పట్టుటకుదగని వాడగుచున్నాడు.

తా. నీచుడగువాడు మిత్రునివలెనే లోబడినవాడై యుండుటచే సాధుజనుల చేత ప్రాణములకుసమానముగా నెన్నబడినవాడైనను కొంచెమైనను దానగుణములేక శరీరములో ప్రాణవాయువనియు సమానవాయువనియు పేర్కొ-నంబడి రూపరహితమై స్పృశించుగుణము లేని వాయువువలె గ్రహించుటకు యోగ్యుడుకాడు.

"రూపరహిత స్పర్శవాన్ వాయుః" అనియుండుటచే వాయువునకు రూపము లేకున్నను స్పర్శగుణముకలదు; దుర్జనునకు స్పర్శ (ఈవి) గుణము లేనందున వాయువున కంటెదుర్గ్రాహుడనిభావము. ౧౭.

శ్లో. ప్రియార్థతృష్ణామాపాద్య విప్రలంభేనఖేదయన్,
వినాపివిగ్రహంలోకాన్ కామవద్బాధతేఖలః. ౧౮.

టీ. ఖలః=నీచుడు, విగ్రహంవినా=కలహము లేకున్నను, ప్రియార్థతృష్ణాం= ఇష్టమైనధనాశను, ఆపాద్య=కలిగింపజేసి, విప్రలంభేన = విపరీతముగా పలుకుటచేత, లేకవంచనచేత, లోకాన్=జనులను, ఖేదయన్=దుఃఖమునొందింపజేసెడి, కామవత్ = కోర్కెగలవానివలె, బాధతే=పీడించుచున్నాడు.

అర్థాంతరము. విగ్రహంవినా=శరీరమునువిడిచి, ప్రియార్థతృష్ణాం=ప్రియా = ప్రియురాలియొక్క, అర్థ=ప్రయోజనముయొక్క, తృష్ణాం=అభిలాషను, ఆపాద్య = కలుగజేసి, విప్రలంభేన=వియోగముచేత, లోకాన్=కాముకజనులను, ఖేదయన్ = గాసిపఱచుచుండెడి, కామవత్=మన్మథునివలె, బాధతే=సాధుజనులను బాధించు చున్నాడు.

తా. దుష్టుడగువాడు కలహింపకయుండియు ఇష్టమైనధనాదులం దాశగలుగ జేసివ్యత్యాసముగాపలుకుటచేతగాని వంచనచేతగాని సాధుజనులను,శరీరము లేక ప్రియురాండ్రయందాశగలిగించి యట్టిప్రియాంగనలను విడిచియున్న కాలమున కాముకజనులను బాధపఱచుకామునిన్ బోలి బాధించుచున్నాడు. ౧౮.

శ్లో. పురుషావివరంప్రాప్య కేఽప్యలక్షితసంభవాః,
దూషయంతి మహాంతంశాన్ ముక్తిక్ష్మాభృతో ద్విషః ౧౯.

టీ. అలక్షితసంభవాః-అలక్షిత=తెలియరాని, సంభవాః=పుట్టుకగల, కేఽపి=కొందఱైన, పురుషాః=మనుష్యులు, వివరం=రంధ్రమును (అనగాదోషసమయమును) ప్రాప్య=పొంది (చూచి) మహావంశాన్=గొప్పకులమందు బుట్టినవారిని, ముఖే=మొగమునందు, తీక్ష్ణాస్సంతః=పరుషవచనములుగల వారగుచు, దూషయంతి = మానము పోగొట్టెదరు.

అర్థాంతరము. అలక్షితసంభవాః=తెలియబడనిపుట్టుకగల, ముఖే=మొగమందు, తీక్ష్ణాః=కాఠిన్యముగల, వివరం=రంధ్రమును, ప్రాప్య=పొంది, మహావంశాన్=పెద్ద వెదుళ్ళను, ఘుణాఇవ=కట్టెలలోని పురుగులవలె, దూషయంతి=చెఱచుచున్నారు.

తా. ఇట్టివంశమునందె బుట్టినవారని దెలియుటకుగాకనుండు కొందఱుదుష్టులు మంచికులముందుబుట్టిన గొప్పవారిని సమయముగనిపెట్టి వెదుళ్ళలోనుండుపురుగులెట్లు గూఢముగాపుట్టి రంధ్రములవలన మెల్లగాలోపల బ్రవేశించి మొనగలముఖములుగలవియై యావెదుళ్ళను జెఱచుచున్నవో అవ్విధమున గొప్పవారిని పరుషవచనములచేత నిందించుచున్నారు. ౧౯.

శ్లో. అదాక్షిణ్యాదతీవోగ్రాః పవనాఇవదుర్జనాః,
గురూనపిప్రతిక్షేప్తుం ప్రయతంతేక్షమాభృతః. ౨౦.

టీ. దుర్జనాః=నీచులు, అదాక్షిణ్యాత్=సరళభావములేనందున, అతీవ=మిక్కిలి, ఉగ్రాః=కోపముగలవారై, క్షమాభృతః=శాంతమునువహించియుండు, గురూనపి=గురువులనుకూడ, ప్రతిక్షేప్తుం=ఆక్షేపించుటకు, ప్రయతంతే = ప్రయత్నించుచున్నారు.

అర్థాంతరము. అదాక్షిణ్యాత్, దక్షిణదిక్కునందు పుట్టకుండుటవలన, ఉగ్రాః=సహించుటకుశక్యముగాకయుండు, గురూన్=గొప్పదైన, క్షమాభృతః=భూధరములను (కొండ) ప్రతిక్షేప్తుం=కదలించుటకు సమర్థములైన, పవనాఇవ=వాయువులవలెనే, ప్రయతంతే=ప్రయత్నించుచున్నారు.

తా. దక్షిణదిశయందుపుట్టక పెద్దకొండలనుకూడా పార్లించుటకు సమర్థములైన వాయువులవలె చక్కనిస్వభావములేక కోపముగలిగిన దుష్టులు గొప్పవారగు నాచార్యులనుకూడా నిందింతురు. ౨౦.

శ్లో. దుర్జనైశ్ఛిద్రవేషైశ్చ మలినైస్సుమనోగణః,
ఆత్మగంధోఽపిసహజం పార్శ్వవంసపిముంచతి. ౨౧.

టీ. మలినైః=పాపముచేదూషింపబడిన, దుర్జనైః = తెలివిలేని, లేక కొంచెము తెలివిగలపురుషులచేత ఆత్తగంధోఽపి = తిరస్కృతుడైనను, (ఆత్తగంధస్తిరస్కృతః; అని అమరము.) సుమనోగణః=విద్వాంసులసముదాయము, సహజం=కూడబుట్టినట్టి, మార్దవం=మెత్తనిభావమును (దయను) నవిముంచతి=విడువదు.

అర్థాంతరము. మలినైః=నల్లనైనట్టి, ద్విరేఫైః = తుమ్మెదలచేత, ఆత్తగంధోఽపి ఆత్త=స్వీకరింపజడిన, గంధోఽపి - పరిమళముగలదియైనను, సుమనోగణః=పూవులసముదాయము, సహజం=తనంతట నేగలిగిన, మార్దవం=మెత్తనిదనమును, నవిముంచతి =విడువదు.

తా. తుమ్మెదలచేత గ్రహింపబడిన పరిమళముగలదియైనను పుష్పములెవ్విధమున తనమృదుభావమును విడువదో యవ్విధమున పండితుఁడగువాడు పాపులగు దుర్జనులచే తిరస్కృతుడైనను తన సాధుత్వమును విడువడు. ౨౧.

శ్లో. గంభీరంచప్రసన్నంచ ధనినోమానసంమహత్,
ద్విజానాముపకారాయ శుచీనాంకేననిర్మితం. ౨౨

టీ. గంభీరం = చపలాదిదోషములేనిదియు, ప్రసన్నం = కోపములేనిదియు మహత్=సమానమానములేనిదియునగు, ధనినః=ధనవంతునియొక్క,మానసం=మనస్సు శుచీనాం=మనసుచేతను కృత్యముచేతను బరిశుద్ధులైన,ద్విజానాం=బ్రాహ్మణులయొక్క ఉపకారాయ=దానలక్షణమైనయుపకారముకొఱకు, కేన=ఏపురుషునిచే (లేక బ్రహ్మచేత,) నిర్మితం=చేయబడెను? (క్లో॥బ్రహ్మానిలార్కేషు అని అ.) అనఁగాతనంతన గల్గిదనిభావము.

అర్థాంతరము. ధనినః=కుబేరునియొక్క, గంభీరం= సంపూర్ణమైన, ప్రసన్న =నిర్మలమైన, మహత్=విశాలమైన, మానసం= మానససరోవరము, శుచీనాం=తెల్లనైనట్టి, ద్విజానాం=పక్షులయొక్క, అనగా హంసలయొక్క, ఉపకారాయ=ఆశ్రయలక్షణమైన యుపకారముకొఱకు, కేన=ఏపురుషునిచేత, (అథవా బ్రహ్మచేత,) నిర్మితం=నిర్మింపబడెను?

తా. ఎప్పుడు నిండియుండుటచే మిక్కిలి లోతుగలిగి నిడివిగలదియై తేటయగు నీటిచే మేటియై కుబేరసంబంధమై తెల్లనిపక్షులైన యంచలకుపకారమైయుండు మానసరోవరమువలె చాంచల్యాదిదోషరహితమై యసదృశమై పరిశుద్ధులైన బ్రాహ్మణులకుపకారమైన ధనవంతులమనస్సు ఏపురుషునిచేత నిర్మింపబడెనోయనుట. ఇచట(క)అ

శబ్దము బ్రహ్మను పేరగుటచే ఏ బ్రహ్మచే నిర్మింపబడెనోయని యుంజెప్పవచ్చును. ద్విజ శబ్దము పక్షికిని బ్రాహ్మణునకును పేరగును. అంచలు మానస సరోవరమందు వర్షకాలమున వసించుటయనునది కవిసమయసిద్ధము.                                    ౨౨.

శ్లో. గుణినోవృత్తవిమలా మహావంశప్రసూతయః,
మూక్తామయాః ప్రకాశంతే నరాహారా ఇవోజ్జ్వలాః.                                    ౨౩.

టీ. గుణినః=వినయాదిగుణములుగలయట్టియు, వృత్తవిమలాః-వృత్త=మంచియాచారముచేత, విమలాః=పరిశుద్ధులైనట్టియు, మహావంశప్రసూతయః-మహావంశ=గొప్పకులమందు, ప్రసూతయః=పుట్టుకగలిగినట్టియు, ముక్తామయోజ్జ్వలాః-ముక్త=విడువబడినట్టియు,ఆమయ=రోగము లేనట్టియు, నరాః=మనుజులు,ఉజ్జ్వలాః=మిక్కిలిప్రకాశముగా, ప్రకాశంతే=తేజరిల్లుచున్నారు.

అర్థాంతరము. గుణినః=సూత్రములుగలట్టియు, వృత్తవిమలాః=గుండ్రములును నిర్మలములునైనట్టియు, మహావంశప్రసూతయః - మహావంశ = గొప్ప వెదుళ్ళయందు, ప్రసూతయః=పుట్టుకగలట్టియు, (కరీకుజీమూతవరాహశంబ మత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని, ముక్తాఫలాని ప్రథితానిలోకే తేషాంచశుక్త్యుద్భవమేవభూరి. అనుటచే వెదుళ్ళయందుముత్తెములు పుట్టుట ప్రసిద్ధము.) ముక్తామయోజ్జ్వలాః=మిక్కిలిప్రకాశించుచుండెడి ముత్యములయొక్క, హారాఇవ = సరములవలె, ప్రకాశంతే = వెల్గుచున్నారు.

తా. మంచిగుణములును సదాచారమును పరిశుద్ధత్వమును, గొప్పవంగసమునందుద్భవమును రోగరాహిత్యమునుగల మనుష్యులు, దారములయందు గుండ్రమును తేటయును పెద్దవెదుళ్ళయందు జన్మమును ముక్తాఫల ప్రాచుర్యమునుగల కంఠసరములంబోలి పొలుచుచున్నారు.                                    ౨౩.

శ్లో. సాధుసంతానభాజోయే సంతస్సంశ్రితనందనాః,
నతేముంచంతిపంచత్వే ప్యౌదార్యంస్వర్ద్రుమాఇవ.                                    ౨౪.

టీ. సాధుసంతానభాజః - సాధు=ప్రశస్తమైన, సంతాన = కులమును, (లేక పుత్రులను) భాజః= పొందినవారు కనుకనే, సంశ్రితనందనాః - సంశ్రిత = పొందబడినట్టి, నందనాః= సంతసముగల, యే=యేసత్పురుషులుగలరో, తే=వారలు, పంచత్వేపి = మరణసమయమునందైనను, ఔదార్యం=దాతృత్వమును (అథవాగొప్పతనమును.) నముంచంతి=విడువరు.

అర్థాంతరము. సాధుసంతానభాజః-సాధు=ఎన్నదగిన, సంతాన=సంతానమను పేరుగల దేవవృక్షమును, భాజః=పొందినట్టియు, సంశ్రితనందనాః=ఆశ్రయింపబడిన నందనోద్యానముగలట్టియు,యే=ఏకల్పవృక్షములు గలవో, పంచత్వేఽపి=పంచసంఖ్యాత్వమందును, ఔదార్యం=దాతృభావమును, నముంచంతి=విడువవో, తే=అట్టి, స్వర్ద్రుమా ఇవ=కల్పవృక్షములవలె (సాధుసంతానాది గుణములుగల సత్పురుషులు) నముంచంతి= విడువరు.

తా. సంతానమనుపేరుగల వృక్షమునుబొంది దేవేంద్రుని నందనోద్యానమందుండు అయిదు కల్పవృక్షములఁబోలె సత్పురుషులు పొగడదగిన కులముగలవారై యెల్లపుడు సంతోషించుచు తమయంత్యకాలమందైనను, అనగాకష్టకాలమందుకూడా, తమ గౌరవమైన దాతృభావమును విడువరు. ౨౪.

శ్లో. స్వయంఛేదముపేత్యాపి నరానామోదయంతియే,
భద్రశ్రియస్తేజాయంతే స్వగోత్రస్యప్రసిద్ధయే. ౨౫.

టీ. యే=ఏనరులు, స్వయం=తాము, ఛేదం=నాశమును, ఉపేత్యాపి=పరులవలనబొందియైనను, పరాన్=ఇతరులను,ఆమోదయంతి=సంతసింపజేయుదురో, తే= అట్టిపురుషులు, భద్రశ్రియః=మంచిసంపత్తుగలవారగుటయె కాక, స్వగోత్రస్య= తమ కులముయొక్క, ప్రసిద్ధయే=ప్రఖ్యాతికొఱకు, జాయంతే=పుట్టుచున్నారు.

అర్థాంతరము. యే=ఏద్రుమములు, స్వయం=తాము, ఛేదం = సమసిపోవుటను, ఉపేత్యాపి=పొందినప్పటికిని, పరాన్=ఇతరులను, ఆమోదయంతి= సువాసనగలవారినిగాజేయుచున్నవో, తే=అట్టి, భద్రశ్రియః=గంధద్రుమములు,స్వగోత్రస్య- స్వ=తమ,గోత్రస్య=పర్వతమైన మలయముయొక్క, ప్రసిద్ధయే = ప్రఖ్యాతికొఱకు, జాయంతే=అవుచున్నవి.

తా. గంధద్రుమములు నరులచే నరుకబడి సానతాళ్ళయందు నూరుటచే సమసిపోవుచున్నవైనను పరులకెవ్విధమున పరిమళమును గలుగజేయుచు తమ పుట్టినస్థలమగు మలయపర్వతమునకు ప్రసిద్ధి గలిగించుచున్నవో యాతీరున సత్పురుషులగువారు తమకు కష్టముగలిగినప్పటికిని పరులను సంతసింపజేయుచుండుటవలన సంపత్తుగలవారై తమవంశమునకు ప్రఖ్యాతినిగలుగజేయుదురు గంధద్రుమములు అంతటగలిగి యుండినను మలయపర్వతమునందే ప్రసిద్ధియగుట కవిసమయసిద్ధము.

ఇట్టిమలయాచలములు నాలుగున్నవనియు, అందు ఏలకులు,లవంగములు, జాజులు,మిరియములు, శ్రీగంధవృక్షములుగలది యొకటియనియు; పగడపుష్పములు,

మృత్యములు, రత్నములగనులు, కర్పూరకదళికలుగలిగి యగస్త్యమునికియునికిపట్టై సమీపమునతామ్రపర్ణీనదిగలిగి సింహములకు స్థానమైనది రెండవదియనియు; దేవతలకుస్థానమై, జనులకు భోగకరమై, యెప్పుడును ఫలపుష్పములుగలది మూడవదనియు; బంగరుకోటలు గలిగిరత్నఖచితములైన మందిరములచేనొప్పి వాకిటిగోపురములందు దేవేంద్రచిత్రితములై రావణాసురునకు స్థానమై కోకిలాలాపసుందరంబై చల్లనిగాలి యెల్లదిక్కులకుఁ గలిగించి లంకయనఁ బరగినదియె నాలవమలయమనియు అలంకారశాస్త్రంబులఁ గనందగు.

శ్లో. కర్ణలంఘిగుణోత్కర్షా వదాన్యాధన్వినోయథా,
నిష్ఫలాన్ నవిముంచంతి మార్గణాన్సంగరేస్థితాః. ౨౬.

టీ. కర్ణలంఘిగుణోత్కర్షాః-కర్ణ=చెవిని, లంఘి=పొందుచుండెడి, గుణ=వినయాదిసుగుణముయొక్క, ఉత్కర్షాః=గొప్పతనముగల, (లేక రాధేయునిమీఱినదానగుణాధికులైన), వదాన్యాః=దాతలైనపురుషులు, సంగరే = సత్యమైనప్రతిజ్ఞయందు, స్థితాః=ఉన్నవారై, నిష్ఫలాన్=పేదలైన, మార్గణాన్=యాచకజనులను, నవిముంచంతి=విడువరు.

అర్థాంతరము. కర్ణలంఘిగుణోత్కర్షాః=చెవినిదాటుచుండు అల్లెత్రాటియొక్కమిక్కుటముగల, సంగరే=యుద్ధమందు, మార్గణాన్=బాణములను, నిష్ఫలాన్=అలుగులులేనివానిని, ధన్వినో యథా = విలుకాండ్రవలె, (వినయాది సుగుణములుగల దాతలైనపురుషులు) నవిముంచతి=విడువరు.

తా. దాతలందు ప్రసిద్ధుడైన కర్ణునిమీఱుచుండెడి గుణాధిక్యముగలిగి సత్యప్రతిజ్ఞగలిగిన దాతలు చెవివఱకు సిద్ధ్వబడినయల్లెత్రాడుగలిగిన విలుకాండ్రు అలుగులులేని బాణముల నెవ్విధమున విడువరో యట్లు పేదలగువారినిచేవిడువరు. ౨౬.

శ్లో. ముంచంతశ్చాపలరుచింయేస్థితాఃపావనేపథి,
ఘనాఇవార్ద్రహృదయాః ప్రథంతేతేదిగంతరే. ౨౭.

టీ. యే=ఏపురుషులు, చాపలే = చపలదోషమందు, రుచిం = ప్రీతిని, ముంచంతః=విడిచినవారై, పావనే=పరిశుద్ధమైన, పథి=మార్గమందు, స్థితాః=ఉన్నవారై, ఆర్ద్రహృదయాః-ఆర్ద్ర = దయచేమెత్తనైన, హృదయాః = మనస్సుగలవారలో తే=వారలు, దిగంతరే=దిశలయందు, ప్రథంతే=కీర్తనీయులగుచున్నారు.

అర్థాంతరము. చాపలరుచిం=మెఱుపుతీవెలమించును, ముంచంతః = పుట్టించుచుండునట్టియు, పావనే=గాలిసంబంధమైన, పథి=మార్గమందు (అనగా ఆకాశమార్గ

ముందు) స్థితాః=ఉన్నట్టియు, ఆర్ద్రహృదయాః=నీటిచేతడిసినవియైన, ఘనా ఇవ= మేఘములవలె, దిగంతరే=దిక్కులందు, (చపలచిత్తులుగాని పరిశుద్ధకరుణార్ద్రహృదయులు) ప్రథంతే=ప్రఖ్యాతులగుచున్నారు,

తా. చాంచల్యదోషమునువిడిచి పవిత్రమైనవృత్తియందుండు దయావంతులగు పురుషులు మెఱుగుతీవెలను వెలిబఱుచుచు వాయుమార్గమగు మింటవసించి జలధరితమైన హృదయముగల మేఘములవలెనే దిక్కులందు ప్రసిద్ధిని బొందుచున్నారు. ౨౭.

శ్లో. ఉదయంప్రాప్య తీక్ష్ణత్వా ద్దుష్ప్రేక్షత్వముపేయుషః,
పాదాంతికే వసుమతో నహిమానీ నిషీదతి. ౨౮.

టీ. మానీ=అభిమానముగల పురుషుడు, ఉదయం=ఔన్నత్యమును, ప్రాప్య= పొంది, తీక్ష్ణత్వాత్=క్రూరుడైయుండుటవలన, దుష్ప్రేక్ష్యత్వం = చూచుటకుగాని భావమును, ఉపేయుషః=పొందినట్టి, వసుమతః=ధనవంతునియొక్క, పాదాంతికే= చరణసమీపమందు, నహినిషీదతి=ఉండడు.

అర్థాంతరము, ఉదయం=పూర్వపర్వతమును, ప్రాప్య=పొంది,తీక్ష్ణత్వాత్ = వేడిగానుండుటవలన, దుష్ప్రేక్ష్యత్వం=చూచుటకసాధ్యత్వమును, ఉపేయుషః = పొందినట్టి, వసుమతః=కిరణములుగల సూర్యునియొక్క, పాదాంతికే=కిరణములదగ్గర, హిమానీ=మంచుగుంపు, ననీషదతి=ఉండదు.

తా. ఉదయపర్వతమునుబొంది మిక్కిలి వేడిమిగల కిరణములుగల సూర్యుని సమీపమందెవ్విధమున మంచు నిలువదో ఆపగిది నధికైశ్వర్యముగలిగి క్రూరుడై చూచుటకసాధ్యుడైన ధనవంతుని సమీపమందు మానవంతుడైన పురుషుడు నిలువడు. ఐశ్వర్యగర్వితుడైన వానివద్ద అభిమానముగలవాడు సూర్యునివద్ద మంచునిలువని యట్లు నిలువడనిభావము. ౨౮.

శ్లో. అసాద్యమందరాగోఽపి భుజంగేనాతిసంగమం,
తద్భోగాత్భ్రమన్కష్టం ప్రాప్నోతివిషమంతతః. ౨౯.

టీ. మందరాగోఽపి, మంద=కొంచెమైన, రాగోఽపి=విశ్వాసముగలవాడైనను, భుజంగేన=విటునితోడ. అతిసంగమం=మిక్కిలిసంబంధమును, ఆసాద్య=పొంది, తద్భోగాత్=తత్=ఆవిటునియొక్క, భోగాత్ =విషయానుభవమువలన, భ్రమన్= భ్రాంతిగలవాడై, తతః=అనంతరమందు, విషమం=అసహ్యమైన, కష్టం = నరకాదిదుఃఖమును, ప్రాప్నోతి=పొందుచున్నాడు.

అర్థాంతరము. తతః=విస్తారమైనట్టి, మందరాఽగోఽపి=మందరమను పేరుగల కొండయు, (క్రవ్వపుగొండ) భుజంగేన=వాసుకియను సర్పము చేత, అతిసంగమం=మిక్కిలిసంబంధమును (అనగా చుట్టడమును,) ఆసాద్య=పొంది, తద్భోగాత్-తత్=అవాసుకి యొక్క, భోగాత్=శరీరమువలన, భ్రమన్=తిరుగుచు, విషమం=పాతాళరూపమైన, కష్టం=గహనమును, ప్రాప్నోతి=పొందుచున్నది. అనగా పొందెననుట.

తా. ఏపురుషుడైనను స్వభావముచే నల్పమైన యనురాగముగలవాడైనను విటపురుషులతోటి చెలిమిచే మోహయుక్తుడై మందపర్వతము వాసుకిచే చుట్టబడినదియై సముద్రమందు త్రిప్పబడి పాతాళమునంటినటుల మిక్కిలి కష్టమును బొందును. చెడ్డ సహవాసముచేత చెడ్డగుణములు గలుగుచున్నవిగాన బోజాగులతోటి చెలిమి తగదనుట.

పూర్వమందు దూర్వాసఋషి కోపమువలన దేవేంద్రుని యైశ్వర్యమంతయు సముద్రమందుగలసిన దానిన్ గాంచి మరలంబడయుటకై దేవాసురులు సముద్రము నుజిలుకుటకు బ్రయత్నించి మందరపర్వతమును కవ్వముగా జేసి దానికివాసుకియను సర్పరాజును జుట్టి చిలుకగా నాకొండ పాతాళమువరకు పోయెనని పురాణప్రసిద్ధము. ౨౯.

శ్లో. జలాశయస్యహృదయే కామస్సోమఇవోదితః,
బహ్వీఃఖలుక్షపాఃప్రాప్తః క్షయంయాతినభోగతః. ౩౦.

టీ. జడాశయస్య=మందబుద్ధిగలపురుషునియొక్క, హృదయే = మనసునందు, ఉదితః=పుట్టినట్టి, కామః=విషయములందలియభిలాష, బహ్వీః=మిక్కిలియైనట్టి, క్షపాః=రాత్రులను, ప్రాప్తః=పొందినప్పటికిని (అనగా అనుభవింపబడినప్పటికిని) భోగతః=అనుభవహేతువువలన, క్షయం=నాశమును, నయాతి=పొందదు.

అర్థాంతరము. జలాశయస్య = సముద్రముయొక్క, హృదయే = మధ్యమందు, ఉదితః = పుట్టి, నభోగతః = ఆకాశమునుబొందిన, సోమః = చంద్రుడు, బహ్వీః=అనేకములైన, క్షపాః = రాత్రులను, ప్రాప్తోఽపి = పొందినవాడైనను = (అనగా ప్రకాశమానుడైనను), క్షయం=కలాహీనత్వమును, యాతి=పొందుచున్నాడు.

తా. సముద్రమధ్యమందుదయమై యాకాశమునుబొందిన చంద్రుడనేక రాత్రులందు ప్రకాశమానుడైనను కృష్ణపక్షరాత్రులందెవ్విధమున గళాహీనత్వమునుబొందునో అట్లు మందబుద్ధియగువాని హృదయమందు జనించిన కామవికారము అనేక రాత్రులు భోగించినను ఆభోగము వలన కామము నాశముకాదు. లకార డకారముల కభేదముగనుక జలాశయమనుచోట జడాశయ అనియునగును. కామాసక్తిగలవాడు

కామము చేతనే శాంతుడు కాడు. ఏలనగా మండుచుండు నగ్నిని శాంతపఱచవలయు నేని నీళ్ళచే చల్లార్పవలయునుగాని తైలాదులచే నార్పదరము గాదు. ౩౦.

శ్లో. క్షీణస్నేహానిశాంతేషు ముంచంత్స్వాంజనసంహతిం.
ఆత్మన్యాత్తరుచిర్యోగీ నిర్వాణంయాతి దీపవత్. ౩౧.

టీ. నిశాంతేషు= ఇండ్లు మొదలగువానియందు, క్షీణస్నేహః = మమకారహీనుడై, స్వాం=తనదైన, జనసంహతిం=పుత్రులు మొదలగు జనసమూహమును, ముంచన్ =విడుచుచునుండువాడై, ఆత్మని=పరవస్తువునందు, ఆత్తరుచిః=పొందబడినయాసక్తి గల, యోగీ=ధ్యాననిష్ఠుడగువాడు, నిర్వాణం = మోక్షమును, యాతి = పొందుచున్నాడు.

అర్థాంతరము. నిశాంతేషు-నిశా=రాత్రులయొక్క, అంతేషు = కొనలందు, అనగా ప్రాతఃకాలములందు, క్షీణస్నేహః - క్షీణ = నాశమైన, స్నేహః = తైలము గలట్టియు, స్వాంజనసంహతిం - స్వ = తనదియైన, అంజన = కాటుకయొక్క, సంహతిం=గుంపును, ముంచన్=విడుచునట్టియు, ఆత్మని= తనయందే, ఆత్తరుచిః - ఆత్త=సంకోచింపబడిన, రుచిః=తేజస్సుగల, దీపవత్ = దీపముబోలె, (గృహాదులను పుత్త్రాదులను విడిచినయోగి) నిర్వాణం=మోక్షమును, యాతి=పొందుచున్నాడు.

తా. వేకువయందు తైలములేనిదియై కొడియందు కాటుకను విడుచుచు వెలుగును తనయందె యణచుకొని నాశమునుబొందు దీపమువలె గృహాద్యాసక్తినివదలి పరమాత్మయం దభిరుచిగలయోగి మోక్షమును బొందుచున్నాడు. ౩౧.

శ్లో. ప్రకృష్టజాతరూపశ్రీ ర్మానేనచమహత్తరః.
ఏకఏవమహార్షేషు భవేత్సర్వోత్తరోభువి. ౩౨.

టీ. ప్రకృష్టజాతరూపశ్రీః- ప్రకృష్ట = అధికమైనట్టుగా, జాత = పుట్టినట్టి, రూప=స్వభావముయొక్క, (లేక సౌందర్యముయొక్క) శ్రీః=కాంతిగలట్టియు, మానేన=అభిమానముచేత, మహత్తరః=మిక్కిలియధికుడైనట్టియు, ఏకః=ఒకడైన పురుషుడు, భువి=భూమియందు, మహార్షేషు=పూజ్యులందు, సర్వోత్తరః = సర్వోత్కృష్టుడుగా, భవేత్ =అగుచున్నాడు. గుణవంతుడు పూజింపదగినవాడని భావము.

అర్థాంతరము. ప్రకృష్టజాతరూపశ్రీః-ప్రకృష్ట=శ్రేష్ఠమైన, జాతరూప= బంగారుయొక్క, శ్రీః=నిగ్గుగలట్టియు, మానేనచ=మహత్పరిమాణముచేతను, మహత్తరః [illegible] ఓటేయెనటి అలంకారము భువి=భూమియందు,

మహార్ఘేషు=మిక్కిలి వెలగలసొమ్ములలో, సర్వోత్తరః=అన్నిటిలో శ్రేష్ఠమైనది, భవేత్=అగుచున్నవి.

తా. మంచిబంగరుచే నిగ్గుగలిగి తూనికెయందు గొప్పదియై వెలగలుగువస్తువుల లో మేటియైన నొకయాభరణ మేతీరున అన్నిటిలోన మేటియైయుండునో అట్లే చక్కనిసౌందర్యముచేత లేక స్వభావముచేత దనరి యభిమానముగలిగిన యొకపురుషుడే భూలోకమందు పూజ్యులలో మిక్కిలి శ్రేష్ఠుడగును. ౩౨.

శ్లో. నిర్ముక్తభోగశుచితా క్షమయామూర్ధ్ని సన్నతిః,
మహిమ్నా చాప్యహీనత్వం నహ్యశేషస్యవిద్యతే. ౩౩.

టీ. నిర్ముక్తభోగశుచితా-నిర్ముక్త=చక్కగావిడువబడినట్టి, భోగ= సంగాదుల చేత, శుచితా=పరిశుద్ధత్వము, క్షమయా=ఓర్పుచేతకూడిన, మూర్ధ్ని = శిరసునం దు, సన్నతిః= అహంకారములేకయుండుటయు, మహిమ్నాచ = ప్రభావముచేతను, అహీనత్వం=నిండియుండుటయు, (ఇవియంతయు) అశేషస్య=ఎల్లవారికి, నవిద్యతే =గలుగదు. గుణవంతులు దొరకుటయరుదనిభావము.

అర్థాంతరము. నిర్ముక్తభోగశుచితా-నిర్ముక్త=పొరవీడినట్టి, భోగ=పడిగె చేత, శుచితా=వెల్లదనమును, క్షమయా=భూమిచేత, మూర్ధ్ని = తలయందు, సన్నతిః = నమ్రత్వమును, మహిమ్నా=భూధారణాదిగుణమహత్త్వముచేత, అహీనత్వం- అహి = సర్పములయొక్క, ఇనత్వం=దొరతనమును, (ఇవియంతయు) అశేషస్య= శేషసర్పము కానిదానికి, నవిద్యతే=కలుగదు.

తా, పొరయూడి తెల్లనైన పడిగెలును భూమినివహించియుండు సర్పరాజత్వ ము మొదలగు గుణాధిక్యమును ఆదిశేషుడను సర్పమునకొకనికే యేవిధమున గలిగియు న్నదో, అట్లే విషయాసక్తియు గర్వమునులేక, ఓర్పు మొదలగుసద్గుణములు అందఱికి గల్గియుండక యొకొకనికే గలిగియుండును. ౩౩.

శ్లో. అమందతరవార్యస్త్రధారాహతమహీభృతః,
చిత్రచాపధరావీరా విద్యోతంతేఘనా ఇవ. ౩౪.

టీ. అమందతర...భృతః-అమందతర=మిక్కిలితీక్ష్ణమైన, వారి = నిరోధించు స్వభావముగల, అస్త్ర=ఆయుధములయొక్క, ధారా=వాడిచేత, హత = కొట్టబడిన, మహీభృతః=రాజులుగల (లేక అమంద=తీక్ష్ణమైన, తరవారి=ఖడ్గముయొక్కయు, అస్త్ర=ఆయుధముయొక్కయు, ధారా = వాడిచేత, హత=కొట్టబడిన, మహీభృతః

= రాజులుగలట్టియు), చిత్రచాపధరాః-చిత్ర=పలువన్నెలుగల, చాపధరాః = విం డ్లనుధరించునట్టి, వీరాః = వీరపురుషులు. విద్యోతంతే=మెఱయుచున్నారు.

అర్థాంతరము. అమందతర .. ... భృతః అమందతర = మిక్కిలియెక్కు వైన, వారి=నీరనెడు, అస్త్ర=ఆయుధముయొక్క, ధారా=ధారచేత (ప్రవాహముచేత) హత = దూకొనిపోయిన, మహీభృతః = పర్వతముగలట్టియు, చిత్రచాపధరాః = నానావర్ణములుగల ఇంద్రధనుస్సునుధరించినట్టి, ఘనాఇవ = మేఘములవలె, (శత్రు వులను ఖండించుశక్తిగలవీరపురుషులు) విద్యోతంతే = వెలుగుచున్నారు.

తా. మిక్కిలిజలప్రవాహముచే వంకలుగాచేయబడిన పర్వతములుగలిగిరతనపు విల్లునుధరించిన మేఘములవలె యతితీక్ష్ణములైన యాయుధములచే పరరాజులఁ గొట్టి మణిఖచితములగుట ననేక వర్ణములచే వెల్గుచున్న విండ్లనుధరించిన పోటరులుప్రకా శించుచుందురని భావము. ౩౪.

శ్లో. నిశాతమసిమూఢంద్రాక్కరేణోల్లాసయన్రిపోః,
కబంధోత్థాపకోరాజా రాజతే జలధే రివ. ౩౫.

టీ. నిశాతం=చురుకైనట్టియు, కరేణ=హస్తముచేత, ఊఢం = ధరింపబడిన, అసిం=కత్తిని, ద్రాక్=త్వరితముగా, ఉల్లాసయన్=ఝుళిపించుచు, రిపోః=శత్రువు లయొక్క, కబంధోత్థాపకః-కబంధ=మొండెమును, ఉత్థాపకః=ఎత్తుచుండు, రాజా= రాజు, రాజతే=తేజరిల్లుచున్నాఁడు.

అర్థాంతరము. నిశాతమసి.నిశా=రాత్రియొక్క, తమసి=చీకటియందు, మూఢం =కన్నులుకాననిజనమును, కరేణ=కిరణములచేత, ద్రాక్=శీఘ్రముగా అనగా ఉదయ సమయమందే, ఉల్లాసయన్=సంతసింపజేయుచుండు, జలధేః = సముద్రముయొక్క, కబంధోత్థాపకః=నీటిని పొంగజేసెడు, రాజేవ=చంద్రుఁడోయనునట్లు, (యుద్ధరంగమున శత్రువులను దునుమాడురాజు) రాజతే=ప్రకాశించుచున్నాడు.

తా. కృష్ణపక్షరాత్రులందు జడంబగులోకమును తనకిరణములచేత ఉదయకాల మందె సంతసింపజేయుచు సముద్రమునుప్పొంగజేయు చంద్రునివలె వాడియైనకత్తిని తనచేతిచే ఝుళిపించుచు యుద్ధరంగమందు శత్రువులశిరస్సులను ఛేదింపుచునుండు రాజే ప్రకాశించుచున్నాడు. అనగా పరాక్రమవంతుడగు రాజే రాజనబడునని భావము. చంద్రుడుదయముకాగా సముద్రము పొంగుట ప్రసిద్ధము. ౩౫.

శ్లో. మణయస్సుధియశ్చాఽపి నిసర్గోదగ్రతేజసః.
అంతస్త్రాసేననిర్ముక్తా రాజ్ఞాంస్యుర్హృదయంగమాః. ౩౬.

టీ. నిసర్గోదగ్రతేజసః - నిసర్గ= తనంతనగలిగిన, ఉదగ్ర=శ్రేష్ఠమైన, తేజసః =కాంతిగల, మణయః=రత్నములు, అంతః = మధ్యమందు, త్రాసేన = త్రాసమను దోషముచేత, నిర్ముక్తాః=విడువఁబడినవియై, రాజ్ఞాం=రాజులకు, హృదయంగమాః = మనోహరములుగా, స్యుః=అగుచున్నవి.

అర్థాంతరము. సుధియోఽపి = పండితులును, నిసర్గోదగ్రతేజసః = స్వభావముచేతనే ప్రకాశించు పరాక్రమముగలవారై, అంతః=మనస్సునందు, త్రాసేన=భయముచేత, నిర్ముక్తాః=విడువబడినవారై, రాజ్ఞాం = రాజులకు, హృదయంగమాః=ప్రియులైనవారుగా, స్యుః=అగుచున్నారు.

తా. స్వభావజన్యమైన ప్రకాశముగల మరకతము మొదలగు రత్నములు త్రాసమను దోషమునువిడిచి రాజులకెవ్విధమున మనోహరములగుచున్నవో యట్లె పండితులగువారు స్వభావముగా వెలుగుచు భయరహితులై రాజప్రియులగుదురు. రాజసమీపమందుండువాడు దుష్టుడు కాగూడదనిభావము. ౩౧.

శ్లో. పశ్యన్మధ్యస్థయాదృష్ట్యా కామంద్రుహ్యంతమప్యరిం,
అనంగీకృత్యయశ్శామ్యే త్సత్యమీశ్వరఏవసః. ౩౨.

టీ. యః=ఏపురుషుడు, కామం=ఇచ్ఛానుసారముగా, ద్రుహ్యంతం=అపకారమును జేయుచుండువాడుగనుక నే, అరిం=శత్రువునైనను, మధ్యస్థయా=తటస్థమైన, దృష్ట్యా=చూపుచేత, అనంగీకృత్య=అనుసరించక, శామ్యేత్ =శాంతుడగుచున్నాడో, సః=వాడు, ఈశ్వరఏవ=దైవమేయగును.

అర్థాంతరము. ద్రుహ్యంతం= బాణప్రయోగముచే ద్రోహమొనర్చినవాడుగనుక నె, అరిం=శత్రువైన, కామం=మన్మథుని, మధ్యస్థయా=నొసలందుగల, దృష్ట్యా=కంటిచేత, (చూచుచు) అనంగీకృత్య=అంగీకరింపక (లేక=అనంగీకృత్య=భస్మీకరించి) శామ్యేత్ =శాంతినిబొందెనో, సః=వాడు, ఈశ్వరఏవ=ఈశ్వరుడే యగును.

తా. ఏపురుషుడు తనయిచ్ఛవచ్చినటుల ద్రోహమును జేయుచుండు శత్రువునకు విరోధముగాని మైత్రిగానిచేయక తటస్థుడై శాంతిగలవాడగునో వాడు తనకపకారము జేసిన మన్మథుని ఫాలనేత్రముచేదహించి శాంతిబొందిన పరమేశ్వరునివలె వెలయును.

పూర్వమందు దక్షప్రజాపతికిని శివునకును కలహముగలిగినందున దక్షుడు శివునకు యజ్ఞమందు హవిర్భాగమియ్యక యజ్ఞముచేయగా వానిపుత్రికయైన గౌరి యచటికిబోయి అవమానితయగుటజేసి నాశరీరమునువిడిచి హిమవంతునికిఁగూతురై పెరుగుచుండుకాలమున తారకాసురుని బాధతాళజాలక దేవతలు పార్వతియందు కుమార

స్వామిని గలిగించుటకై త్వరబడినవారై దక్షిణామూర్తిరూపమున హిమవత్పర్వతమున తపంబాచరించుచుండు పరమేశ్వరునకు కామవికారమును గలిగించుటకై మన్మథునిం బంపినంత వాడు బాణమును వేయగా నతడు ఫాలనేత్రముచే దహించెనని పురాణ ప్రసిద్ధము. 32.

శ్లో. సుపార్థివైశ్చపద్మైశ్చ సర్వతోముఖభూతిభిః,
ప్రసారితేమిత్రకరే త్యజంతేకోశసంపదః. 33.

టీ. సర్వతోముఖభూతిభిః-సర్వతోముఖ = అన్నికడలనుండి వచ్చుచుండెడి, భూతిభిః=సంపదలుగల, సుపార్థివైః = చక్కనిదొరలచేత, మిత్రకరే = స్నేహితుల చెయ్యి, ప్రసారితేసతి=చాపబడినదికాగా, కోశసంపదః=ధనసంబంధములు, త్యజంతే =విడువబడుచున్నవి. (అనగా ధనమొసంగబడుచున్నది).

అర్థాంతరము, సర్వతోముఖభూతిభిః-సర్వతోముఖ=జలముచేతగలిగిన, భూతిభిః =కాంతిసంపదలుగల, పద్మైః=తామరలచేత, మిత్రకరే=సూర్యకిరణము, ప్రసారితేసతి= వ్యాపించుచుండగా, కోశసంపదః-కోశ=మొగ్గలయొక్క, సంపదః=సమృద్ధులు, త్యజంతే=విడువబడుచున్నవి.

తా. నీటిచేనలరుచుండెడి తామరలు సూర్యకిరణములు వ్యాపించినపుడు తమ మొగ్గలను విరియజేయువిధంబున నన్నిదిక్కులనుండి గలిగెడి సంపదగలరాజులు తమకు మిత్రులగువారు చెయిజాచిరేని తమధనము నొసగుటకై బొక్కసమును విడుచుచున్నారు.

ఇచట వ్యాఖ్యానమందు స్నేహితులుయుద్ధముచేయుటకై చెయిజాపగా రాజులు కత్తియొరలను విడుచుచున్నారని వ్రాయబడినది; యదియసమంజసంబుగాదోచుచున్నది. లేక, ప్రసారితే మిత్రకరే అనుచోట అమిత్రకరే అని పదవిభాగముచేసిరేని యది యొకవిధముగా కావచ్చును. అయినను (ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవహిరక్షణం) అనియుండుటచేత సర్వతోముఖ సంపద్విశేషణము సార్థకమాచున్నది. గనుక ఖడ్గపిధానత్యాగమునకంటె మిత్రులకై ధనత్యాగము మేలుగదా. 33.

శ్లో. విశిష్టంసర్వభూతేభ్య శ్శ్రోతవ్యగుణవత్తయా,
నత్యజేద్విభుతానిత్య మాకాశమివభూమిపం. 34.

టీ. శ్రోతవ్యగుణవత్తయా-శ్రోతవ్య=వినదగినట్టి, గుణవత్తయా=ఔదార్యాది గుణముకలుగు కారణముచేత, సర్వభూతేభ్యః=సమస్తప్రాణులకంటె, విశిష్టం=శ్రే

ష్ఠుడైనట్టి, భూమిపం=రాజును, నిత్యం=ఎల్లకాలము,విభుతా=ప్రభుత్వము, నత్యజేత్ =విడువదు.

అర్థాంతరము. శ్రోతవ్యగుణవత్తయా-శ్రోతవ్య=వినదగిన, గుణవత్తయా=గుణి భావముతోడగూడినదియై, సర్వభూతేభ్యః=పృథివి మొదలగు భూతములకంటె, విశిష్టం =అంతటనుబొందినట్టి, నిత్యం=నాశరహితమైన, ఆకాశమివ=బయలువలెనే, విభుతా =వ్యాపకత్వము, నత్యజేత్=విడువదు.

తా. శబ్దగుణముతోడ గూడుకొని సకలములయిన పృథ్వ్యాదిభూతములకంటె మహత్త్వనిత్యత్వాది ధర్మములుగల హెచ్చైనయాకాశము వ్యాపకత్వమును నెవ్విధమునవదలదో అటులనే వినదగిన ఔదార్యాది సుగుణములు గలుగుటవలన సకలప్రాణివర్గమునకంటె శ్రేష్ఠుఁడయినరాజును ప్రభుత్వమెప్పుడును విడువకయుండును. శబ్దగుణకమాకాశం, తచ్చైకం విభునిత్యంచ. అనితర్కశాస్త్రము. ౩౯.

శ్లో. కాలేమృదుశ్చతీక్ష్ణశ్చ నృపఃస్యాద్యదిసూర్యవత్,
ఉదయఃక్రియతేతస్య మండలేనానురాగిణా. ౪౦.

టీ. నృపః=రాజు, కాలే=ఒకకాలమందు, మృదుః=కోపములేనివాఁడును, (మఱియొకకాలమందు) తీక్ష్ణః=క్రౌర్యముతోకూడినవాఁడును, స్యాద్యది=అగునేని, తస్య=ఆరాజునకు, అనురాగిణా=ప్రీతిగల, మండలేన=రాష్ట్రముచేత అనఁగా దేశమం దలిప్రజలచేత, ఉదయః=అభ్యుదయము, సూర్యవత్=సూర్యునకువలెనే, క్రియతే= చేయఁబడుచున్నది.

అర్థాంతరము. సూర్యః = సూర్యుఁడు, కాలే=ఒకకాలమందు, (అనఁగాహిమకాలమందు) మృదుః=చల్లఁగాచూడఁదగినవాఁడును, కాలే=మఱియొకకాలమందు, తీక్ష్ణః=వేడిమిచేత జూచుటకుగానివాఁడును, స్యాద్యది=అగునేని, తస్య=ఆసూర్యునకు, అనురాగిణా=ఎఱ్ఱనయిన, మండలేన=బింబముచేత, ఉదయః=పుట్టుక, క్రియతే=చేయఁబడుచున్నది.

తా. రాజగువాడు సూర్యునివలె, నొకకాలమందు కోపములేనివాఁడును, మఱియొకకాలమందు కోపముగలవాడును అగునేని యారాజునకు అనురాగముగల రాష్ట్రముచేత నభ్యుదయముగలుగ జేయబడుచున్నది. "శ్లో. మృదుశ్చేదవమన్యేత తీక్ష్ణాదుద్విజతేజనః, తీక్ష్ణశ్చైవమృదుశ్చైవ ప్రజానాంనతుసమ్మతః." అనియుండుటచే రాజు పూజ్యులందు మృదుస్వభావము గలవాడయి దుష్టులందు క్రౌర్యస్వభావము గల వాఁడయియుండినచో వానికి జనులు ప్రీతిగలవారయియుందురు. ౪౧.

శ్లో. అనువేలంవిహన్యంతే యస్యసింధోరివోద్యమాః,
తంప్రమథ్యశ్రియఃకోఽపి విపక్షోభూభృదుద్ధరేత్. ౪౧.

టీ. యస్య=ఏరాజుయొక్క, ఉద్యమాః=ఉద్యోగములు, అనువేలం=కాలకాలమందును, విహన్యంతే=పగరచేత నశింపబడుచున్నవో, తం=ఆరాజును, కోఽపి=ఎవఁడయినను, విపక్షః=శత్రువయిన, భూభృత్=రాజు, ప్రమథ్య=బాధించి, శ్రియః=భండారము మొదలుగాగల సంపదలను, సింధోరివ=సముద్రసంపదలనువలెనే, ఉద్ధరేత్=అపహరించును.

అర్థాంతరము. యస్య=ఏ, సింధోః=సముద్రముయొక్క, ఉద్యమాః=ఉప్పన మొదలగు వ్యాపారములు, అనువేలం=గట్టునుగుఱించి, విహన్యంతే=కొట్టబడుచున్నవో, తం=ఆసముద్రమును, కోఽపి=ఒకానొకటియయిన, విపక్షః=ఱెక్కలులేని, భూభృత్=మందరపర్వతము, ప్రమథ్య=చిలికి, శ్రియః = అమృతము లక్ష్మి కామధేనువు మొదలగు సంపదలను, ఉద్ధరేత్=ప్రకాశపఱుచును.

తా. ఏరాజుయొక్క ఆలోచనలన్నియు బయలుపడి పరరాజులచే జెరుపఁబడుచున్నవో అట్టిరాజును ఎవఁడయిననొక శత్రురాజుబాధించి వాని ఐశ్వర్యములను, ఉప్పనచేత తీరములనాక్రమించు సముద్రుని మందరపర్వతముమథనముచేసి అమృతము మొదలగువానిని యెత్తినచందమున నెత్తును. అనఁగా బుద్ధిలేక ఆలోచనలనుబయలు పఱుచురాజు శత్రువుచేజయింపఁబడును. ౪౧.

శ్లో. ఆక్రమ్యయస్యదోర్దండ మరిచక్రంప్రకాశతే,
ప్రాప్నోతిపురుషోలోకే సవైకుంఠఇతిప్రథాం. ౪౨.

టీ. యస్య=ఏరాజుయొక్క, దోర్దండం=దండమువలెనుండు భుజమును (అనఁగా బాహుబలమును,) ఆక్రమ్య=స్వాధీనపఱుచుకొని, అరిచక్రం= శత్రుసముదాయము, ప్రకాశతే=వెలుగుచున్నదో, సఃవై=ఆ, పురుషః=మనుష్యుఁడు, కుంఠఇతి=సామర్థ్యములేనివాఁడని, లోకే=జగత్తునందు, ప్రథాం=ప్రఖ్యాతిని, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

అర్థాంతరము. యస్య=ఏవిష్ణువుయొక్క, దోర్దండం=భుజదండమును, ఆక్రమ్య=ఆశ్రయించి, అరిచక్రం=అరి-అరములను నవయవములుగల, చక్రం=చక్రాయుధము, ప్రకాశతే=వెలుగుచున్నదో, సః=అట్టిప్రసిద్ధిగల, పురుషః=భగవంతుఁడగువిష్ణువు, లోకే=భువనమందు, వైకుంఠఇతి=వైకుంఠుఁడని, ప్రథాం=ఖ్యాతిని, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. భుజపరాక్రమముచేత పరరాజులనుజయింపక సామర్థ్యములేనివాడయి పరరాజులకు వశుఁడయియుండెనేని యారాజు ప్రసిద్ధినొందజాలఁడు. మరియు, ఆక్రమ్య-దోర్దండం,అనియుండుటంబట్టి తనకేలును శత్రురాజునకుహతకోలగానిచ్చువాఁడనియు నర్థమగుటచే పరరాజులను హస్తలాఘవమిచ్చి సేవించువాడనియు ధ్వనిగలుగుచున్నది.

ద్వితీయార్థమున, ఇతరములయిన శార్ఙ్గాద్యాయుధములుండిననుచక్రమే ముఖ్యాయుధముగా గలవాడు విష్ణువనిభావము. ఇచట వై అనుపాదపూరణార్థకాక్షరమును నొకతటి జేర్చుకొనుటచేతను నొకతటి విడుచుటచేతను నర్థద్వయమున కాస్పదంబయియున్నది. ౭౨.

శ్లో. బలినావిద్విషేపుంసే పదందీయేతచేద్భువి,
మహత్త్వంప్రాప్యసోఽల్పోఽపి విక్రమేణశ్రియంహరేత్. ౭౩.

టీ. బలినా=బలముగలరాజుచేనయినను, విద్విషే=శత్రువయిన, పుంసే=పురుషునికొఱకు, భువి=తనభూమియందు, పదం=స్థానము, దీయేతచేత్, ఇయ్యబడినట్లయిన, సః=ఆశత్రువు, అల్పోఽపి=కోశాదులచే నల్పుఁడయినను, మహత్త్వం=గొప్పతనమును, ప్రాప్య=పొంది, విక్రమేణ=పరాక్రమముచేత, శ్రియం=భండారాదిసంపదను, హరేత్=అపహరించును.

అర్థాంతరము. బలినా=బలిచక్రవర్తిచేత,విద్విషే=శత్రువైన, పుంసే=వామనరూపుడయిన పురుషోత్తమునికొఱకు, భువి=భూమియందు, పదం=మూఁడడుగలంత నేల, దీయేతచేత్=ఇయ్యబడినట్లయిన, సః=ఆవిష్ణువు, అల్పోఽపి=వామనరూపుఁడయినను, మహత్త్వం=త్రివిక్రమత్వముచే గొప్పదనమును, ప్రాప్య=పొంది, శ్రియం=రాజ్యలక్ష్మిని, హరేత్=అపహరించును.

తా. రాజుతానుబలవంతుడయియుండి శత్రువుబలహీనుఁడనియెంచి తనదేశమందు శత్రువునకు కొంచెము భూమినిచ్చెనేని యాశత్రువు క్రోశాదులచేత బలముగలవాఁడయి క్రమముగా పూర్వమునందు విష్ణువు బలిచక్రవర్తియొద్దకు వామనుఁడయిచని మూడడుగుల నేలను యాచించి తోడనే మూఁడులోకములను ఆక్రమించినటుల శత్రువు భూమినంతయును ఆక్రమించును. శత్రువెంతచిన్నవాఁడయినను కొంచెమైనను స్థలమియ్యరాదు. బలిచక్రవర్తిని వామనమూర్తి జయించినకథ భాగవతాదులందు ప్రసిద్ధము. ౭౩.

శ్లో. నళినానాంనృపాణాంచ శ్రియంహిమహతామపి,
మిత్రప్రతాపోభూయోఽపి వర్ధయత్యనిశోజ్జ్వలాం. ౭౭.

టీ. హిమహతామపి—హిమ=మంచుచేత, హతామపి=క్లేశమునుబొందినట్టి, అనిశోజ్జ్వలాం=రాత్రులందుప్రకాశించని, నళినానాం=కమలములయొక్క, శ్రియం=కాంతిని, భూయోఽపి=మఱల అనఁగాప్రాతఃకాలమందు, మిత్రప్రతాపః--మిత్ర=సూర్యునియొక్క, ప్రతాపః=తేజస్సు, వర్ధయతి=పెంపొందుచున్నది.

అర్థాంతరము. అనిశోజ్జ్వలాం—అనిశ=ఎల్లప్పుడును, ఉజ్జ్వలాం=ప్రకాశించునట్టి, మహతాం=గొప్పవారైన, నృపాణాం=రాజులయొక్క, శ్రియం=సంపదను, మిత్రప్రతాపః=స్నేహితులపౌరుషము, భూయః=అధికమగునట్టుగా, వర్ధయతి=పెంపొందుచున్నది.

తా. మంచుచేపెంపుబాసి రాత్రులందు ప్రకాశించని తామరలకాంతిని సూర్యకాంతి మరల ప్రాతఃకాలమందు వృద్ధిబొందించునట్లు, మహాత్ములగు రాజులసంపదలను సుహృదులువృద్ధి బొందించు చున్నారు. సహాయసంపత్తిలేకనే జయలక్ష్మికలుగనేరదని భావము. మంచునకును తామరలకును విరోధముగనుక తామరలురాత్రులందుప్రకాశింపక తమకు హితకరమైన సూర్యప్రభయందు ప్రకాశించుట స్వభావసిద్ధము. ౭౭.

శ్లో. స్వస్థానాదవరోప్యేత బలాత్పుంసాపరేణయః,
అపారిజాతంనప్రాహుః పార్థివంపాదపంచతం. ౭౮.

టీ. యః=ఏరాజు, పరేణ=శత్రువైన, పుంసా=పురుషునిచేత, స్వస్థానాత్=తనరాజ్యమువలననుండి, బలాత్=బలిమివలన, అవరోప్యేత=త్రోయఁబడుచున్నాఁడో, పాదపం=నాల్గింటినొకపాలునురక్షించునట్టి అనఁగా రాష్ట్రిమఁదొక కొంతప్రదేశమునకు దొరయైనట్టి, తం=ఆ, పార్థివం=రాజును, అపారిజాతం—అప=పోగొట్టబడిన, అరి=శత్రువులయొక్క, జాతం, సమూహముకలవాఁడని (అనగాశత్రువులేనివాడని) నప్రాహుః=పలుకరు.

అర్థాంతరము. యః=ఏవృక్షము, పరేణ=శ్రేష్టుఁడైనట్టి, పుంసా=పురుషునిచేత, అనఁగాపురుషోత్తముడైన కృష్ణునిచేత, స్వస్థానాత్=స్వర్గస్థానమునుండి, బలాత్=బలిమివలన, అవరోప్యేత=భూమికిదింపబడుచున్నదో, తం=అట్టి, పాదపం=వృక్షమును, పార్థివం=భూలోకమందు బుట్టినదానిగాను, అపారిజాతం=పారిజాతముకాదనియును, నప్రాహుః=చెప్పరు.

తా. శత్రురాజుచే రాజ్యము వెడలగొట్టబడి కొంతప్రదేశమునకు మాత్రము ప్రభువుగానుండు రాజును శత్రువులేనివాడనియును, శ్రీకృష్ణునిచేత స్వర్లోకమునసుం డి భూలోకమునకు దేబడిన కల్పవృక్షమును పారిజాతవృక్షము కాదనియును జెప్పరు. ఈకథ భాగవతాది గ్రంథములందు బ్రసిద్ధము. ౭౫.

శ్లో. విరసప్రకృతిర్భూపః సత్త్వవానపిసింధువత్,
రాజ్ఞాస్వాంతసముత్థేన క్షోభ్యతేమృదునాపిసః. ౭౬.

టీ. యః=ఏరాజు, విరసప్రకృతిః=గుణములేనిస్వభావముగల, (అనఁగాఔ దార్యాదిగుణములులేనట్టి) లేక, విరస=విరక్తులైన, ప్రకృతిః=రాజ్యాంగములగు స్వా మ్యాదులుకాని, పురజనులుకానిగలవాడో, సః= అట్టి, భూపః= రాజు, సత్త్వవా నపి=బలముగలవాఁడైనను, స్వాంతసముత్థేన-స్వ=తనయొక్క, అంత=మధ్యమందు (అనగాతనకులమందు) సముత్థేన=పుట్టినట్టి, మృదునా=బలహీనుడైన, రాజ్ఞా=రాజుచే త, విరసప్రకృతిః-విరస=మిక్కిలియుప్పగుటచే తీపులేనట్టి, ప్రకృతిః=స్వభావము గల, సత్త్వవాన్=మొసలిమొదలగు జలజంతువులుగల, సింధువత్=సముద్రము, స్వాంతసముత్థేన = తనమధ్యమందు బుట్టినట్టి, మృదునా=మనోహరుడైన, రాజ్ఞా= చంద్రుని, క్షోభ్యతే=కలుషయుక్తుఁడుగాఁజేయఁబడుచున్నాఁడు.

తా. మొసళ్ళుమొదలగు దుష్టజలజంతువులుగల సముద్రుఁడు తనలో పుట్టినట్టిమ నోహరుఁడైన చంద్రునిచేత నేలాగున కలుషితుడగు చున్నాడో యవ్విధమున ప్రకృ తిమండలమందనురాగలేనిరాజుబలవంతుఁడైనను తనకులమందుపుట్టినబలహీనుఁడైనరాజు చేత జయింపబడు చున్నాడు. ప్రకృతిమండలమనగా,- « స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలానిచ, రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాంశ్రేణయోఽపిచ" అనిఅమర ము. ప్రకృతిశబ్దము రాజ్యాంగములగు స్వామ్యాదులకును, పురుజనులకును పేరగుచున్నది. శ్లో. స్వామ్యమాత్యశ్చరాష్ట్రంచ దుర్గం కోశోబలంసుహృత్, పరస్పరోపకారీదం సప్తాంగంరాజ్యముచ్యతే. అనికామందకము. స్వామ్యాదులొకరికొక రుపకారవంతులై యుందురుగాన పరస్పర మనురాగముగలవారుగా నుండవలయును. పురజనులయం దనురాగము గలిగి యుండవలయును. అట్లెయ్యేని యారాజు దుర్జయుడుగా నుండును. ౭౬.

శ్లో. యస్యరాజ్ఞోనవసుధా సేవ్యాసుమనసాంగణైః,
ధ్రువంబహులదోషోత్థః క్షయఃస్యాత్తస్యమండలే. ౭౭.

టీ. యస్య=ఏ, రాజ్ఞః=రాజుయొక్క, వసుధా=భూమి, సుమనసాం=విద్వాంసులయొక్క, గణైః=గుంపులచేత, సేవ్యా = అనుభవింపదగినది, నభవతి = కాదో, తస్య=ఆరాజుయొక్క, మండలే=రాష్ట్రమందు, బహుళదోషోత్థః=బహుళ=హెచ్చయిన, దోష=పాపముచేత, ఉత్థః=పుట్టినట్టి. క్షయః=నాశము, స్యాత్=అగును, ధ్రువం=నిశ్చయము.

అర్థాంతరము. యస్య=ఏ, రాజ్ఞః=చంద్రునియొక్క, నవసుధా=నూతనమైనయమృతము, సుమనసాం=దేవతలయొక్క, గణైః=సమూహములచేత, సేవ్యా=పానముచేయదగినది, స్యాత్=అయ్యెనో, తస్య=ఆచంద్రునియొక్క, మండలే=బింబమందు, బహుళదోషోత్థః—బహుళ=కృష్ణపక్షమందలి,దోషా=రాత్రివలన, ఉత్థః=కలిగిన, క్షయః=నాశము, అనఁగా కలాహీనత్వము, భవతి=అగును,ధ్రువం=నిజము.

తా. రాజగువాడు తనసంపదను పండితులగువారికి ఉపయోగపఱచకయుండెనేని వానిరాజ్యము పాపాధిక్యముచేత కృష్ణపక్ష చంద్రుని కలలు నశించునటుల నశించును. చంద్రునియందుగల నూతనామృతమును దేవతలు క్రమముగా పానము జేయుట వలన బహుళపక్షమందు కళలునశించును. శ్లో. అగ్నౌహుతంచదత్తంచ సర్వంసోమగతంభవేత్, తత్రసోమస్సముత్పన్నః శీతాంశుర్విమలక్షణః, అష్టాశీతి సహస్రాణి విస్తీర్ణేయోజనానితు, ప్రమాణంతత్రవిజ్ఞేయం కలాః పంచదశైవతు, షోడశాపి కలాప్యత్ర ఇత్యేకాపివిధిర్భవేత్, తంచసోమంపపుర్దేవాః పర్యాయేణానుపూర్వశః, ప్రథమాంపిబతేవహ్ని ర్ద్వితీయాంపిబతేరవిః, విశ్వేదేవాస్తృతీయాంతు చతుర్థాం సలిలాధిపః, పంచమాంతువషట్కారః, షష్ఠీంపిబతివాసవః, సప్తమీంబుషయోదేవా అష్టమీమప్యజైకపాత్, నవమీంకృష్ణపక్షస్య యమఃప్రాశ్నాతివైకలాం, దశమీంపిబతే వాయుః పిబత్యేకాదశీముమా, ద్వాదశీంపితరస్సర్వే, సమస్త్యాతువిభాగతః, త్రయోదశీంధనాధ్యక్షః కుబేరః పిబతేకలాం, చతుర్దశీంపశుపతిః పంచదశ్యాంప్రజాపతిః, నిపీతైక కలాశేష శ్చంద్రమాన ప్రకాశతే, కలాషోడశికాయాసా త్వపః ప్రవిశతేసదా, అమాయాంతుసదాసోమ ఓషధీః ప్రతిపద్యతే. అని వ్యాసస్మృతియందుండుట వలన కృష్ణపక్షపాడ్యమి మొదలుకొని అమావాస్యవఱకు చంద్రునికలలను వరుసగా అగ్నిరవి విశ్వేదేవ వరుణ వషట్కార వాసవ బుష్యజైకపాద్యమవాయు ఉమా పితృకుబేర శంకర ప్రజాపతులు పానముచేయుదురు, ఇట్లునశింపబడిన చంద్రునిపదియాఱవకల అమావాస్యయందు ఔషధములను నీరునుబొందినవియై యావులచే భక్షింపబడి యాయావుల పాలునెయ్యి యగ్నియందు బ్రాహ్మణులచే హోమముచేయబడుటచే మఱల చంద్రుడు

శ్లో. అధఃకుర్వన్ప్రజాస్సర్వా బహుధామహిమోల్బణః,
రాజాపర్వణి కస్మింశ్చి ద్భవేదహిభయాకులః. ౪౬.

టీ. బహుధా= అనేకవిధములైన, మహిమోల్బణః = ప్రభావముచేత వ్యక్తుఁడైనను, రాజా=రాజు, సర్వాః = సమస్తమైన, ప్రజాః=జనులను, అధఃకుర్వన్ = మహిమచే తిరస్కరించినవాడై, కస్మింశ్చిత్ = ఒకానొక, పర్వణి = కాలమందు అహిభయాకులః - అహిభయ = తనపక్షమందుగలిగిన భయముచేత, ఆకులః=దుఃఖముగలవాడు, భవేత్ =అగుచున్నాఁడు.

అర్థాంతరము. సర్వాః = సమస్తమైన, ప్రజాః = (భూమియందుగల) ప్రజలను,అధఃకుర్వన్=క్రిందుచేయుచు, అనఁగాతాను మింటనుండుటచే జనులనుక్రిందుగా జేయుచు, బహుధామహిమోల్బణః-బహు= అనేకములైనయోషధులు మొదలగువానికి ధామ = ఆశ్రయమైన, హిమ= మంచుచేత, ఉల్బణః = ఎక్కువైనట్టి, రాజా = చంద్రుఁడు, కస్మింశ్చిత్ = ఒకానొక,. పర్వణి = పూర్ణిమాప్రతిపత్సంధియందు, అహిభయాకులః - అహి = సర్పాకారుడైనరాహువువలన, భయ= భీతిచేత, ఆకులః = చింతగలవాఁడు, భవేత్ = అగును.

తా. భూలోకమందు గల జనుల నందఱిని గ్రిందుండునట్లు జేసి నింగి వెలుంగుచుండు చంద్రుడు ఒకానొక పర్వకాలమున రాహుగ్రహముచే గ్రసింపబడునట్లు తన బాహుబలిమిచే జనులనందఱిని ధిక్కరించియుండురాజు, ఒకానొక కాలమందు రాష్ట్రములోగలిగిన కలతచేత చిక్కుబడును. "శ్లో. హిరణ్యధాన్యవస్త్రాణి వాహనాని తథైవచ, తథాన్యేద్రవ్యనిచయాః ప్రజాతస్సంభవంతిహి, వార్తాంప్రసాధయెన్నిత్యం వార్తావైలోకసంశ్రయః, ప్రజాయాం వ్యసనస్థాయాం నకించిదపి సిధ్యతి." అని కామందకము. బంగారు, ధాన్యము, వస్త్రములు, వాహనములు మొదలగునవియన్నియు రాజునకు బ్రజలవలననె గలుగుచున్నవిగాన యట్టిప్రజలు విరక్తులైనచో రాజునకు తొందరగలుగుననియు నట్టిప్రజలను రాజు చక్కగాపాలించవలయుననియుభావము.

శ్లో. మహతాకరపాతేన సర్వంవసుమతాంహరన్,
సంపూర్ణోఽప్యక్ష్ణుతేరాజా కలాయాఃక్షయమన్వహం. ౪౭.

టీ. రాజా = రాజు, సంపూర్ణోఽపి, ధనాదులచేనిండినవాడైనను, మహతా =చాలాయెక్కువైన, కరపాతేన - కర=కప్పముయొక్క, పాతేన = కల్పించుట

చేత, వసుమతాం = ధనవంతులయొక్క, సర్వం = లెక్కమంతయును, హరన్ = అపహరించినవాఁడై, అన్వహం = ఎల్లప్పుడు, కలాయాః = ధనాభివృద్ధియొక్క, క్షయం = నాశమును, అశ్నుతే = పొందుచున్నాఁడు. "కలాశిల్పేవిత్తవృద్ధ్యాం చంద్రాంశేశకలేకలా" అనియమరము.

అర్థాంతరము. మహతా=అధికమైన, కరపాతేన - కర = కిరణములయొక్క, పాతేన=ప్రసరణముచేత, వసుమతాం = తేజస్సుగల గ్రహములయొక్కయు నక్షత్రములయొక్కయు, సర్వం = సమస్తమైనకాంతిని, హరన్ = పరిహరించుచుండు, రాజా=చంద్రుఁడు, అన్వహం = సర్వదా, కలయా = తనకాంతిచేత, క్షయం = నాశమును, అశ్నుతే = పొందుచున్నాఁడు.

తా. మిక్కిలి యెక్కువయైన కిరణప్రసరణములచేత తేజస్సుగల యితర గ్రహనక్షత్రములనాచ్ఛాదించుచుండు చంద్రుఁడుకృష్ణపక్షమందు సర్వదా క్షీణించునట్లు, తనయధికారము చెల్లుచున్నదని ధనికులవలననుండి హెచ్చైనపన్నును గొనురాజుధననాశమునుజెందును. "శ్లో. యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవస్త్రియః, ఏకస్యాపినపర్యాప్తం తస్మాదతితృషాంత్యజేత్. పరాంవినీతః సముపైతి సేవ్యతాం మహీపతీనాం వినయోహిభూషణం, ప్రవృత్తదానోమృదుసంచరత్కరః కరీవభద్రో వినయేనశోభతే." అని కామందకము. భూమిలోగల భోగ్యవస్తువులన్నియు ఆశగలయొకనికే చాలకుండుటచే రాజగువాఁడు కొంచెముగా పన్నుఁదీసికొని ప్రజలను బోషింపవలయుననియు గర్వముచేత తేజోవంతుల నాక్షేపింపరాదనియు భావము. రగ

శ్లో. యోహీనస్యప్రతాపేన రాజాసన్ పరిభూయతే।
సతునక్షత్రగోష్ఠీషు తేజస్వీతిప్రకీర్త్యతే. ౫౦.

టీ. యః = ఏపురుషుఁడు, రాజాసన్ = రాజైనవాఁడైనను, హీనస్య = ధనముచేతగాని బలముచేతగాని హీనుఁడైనరాజుయొక్క, ప్రతాపేన = పౌరుషముచేత, పరిభూయతే = తిరస్కరింపఁబడుచున్నాఁడో, సతు=ఆరాజును, క్షత్రగోష్ఠీషు= క్షత్రియులపరస్పరవాక్యములందుగాని, లేక సభలయందుగాని, తేజస్వీతి=పరాక్రమము గలవాఁడని, నప్రకీర్త్యతే = పొగడఁబడఁడు.

అర్థాంతరము. యః = ఏచంద్రుఁడు, రాజాసన్ = ప్రకాశించువాఁడైనను, అహీనస్య = సర్పశ్రేష్ఠముయొక్క, అనఁగా రాహువుయొక్క, ప్రతాపేన= ప్రభావముచేత, పరిభూయతే = తిరస్కరింపఁబడుచున్నాఁడో, సః = అట్టిచంద్రుఁడు

నక్షత్రగోష్ఠిషు = చుక్కలయోలగములందు, తేజస్వీతి=కాంతిగలవాఁడని, ప్రకీర్త్యతే=పొగడఁబడుచున్నాఁడు.

తా. స్వయముగా రాజైనవాఁడు ధనాదులచే హీనుఁడైన యొకనిచే పరాభూతుఁడయ్యెనేని యట్టిరాజును క్షత్రియుల సభలయందు పరాక్రమవంతుఁడని మెచ్చుకొనరు. బలవంతుఁడగునేని యల్పునకులోఁబడునాయని యనుమానముగలుగునని భావము. చంద్రుఁడు సంపూర్ణముగా ప్రకాశించుచు పౌర్ణమి తిథియందే రాహువుచే గ్రహింపఁబడుచున్నాఁడని యర్థము. ౫౦.

శ్లో. ఆరభ్యతే మహత్కార్యం యైః క్షుద్రైరపిపార్థివైః,
తేచక్రవర్తినోభూత్వా జాయంతేభద్రభాజనం. ౫౧.

టీ. క్షుద్రైః=నీచులైన, రాజభిరపి = రాజులచేతనైనను, మహత్ = ఎక్కువైన, కార్యం=పని, ఆరభ్యతే=చేయనుద్యమింపఁబడెనేని, తే = ఆరాజులు, చక్రవర్తినః = సార్వభౌములు, భూత్వా = ఆయి, * భద్రభాజనం = మంగళమునకు పాత్రముగా, జాయంతే = అగుచున్నారు.

అర్థాంతరము. పార్థివైః= పృథివియందుబుట్టిన, క్షుద్రైరపి = కొంచెములైన పరమాణువులచేతనైనను, మహత్కార్యం = గొప్పదగు ఘటము మొదలగు కార్యము, ఆరభ్యతే=ప్రారంభింపబడెనేని, తే=ఆపరమాణువులు, చక్రవర్తినః - చక్ర=కుమ్మరవానిసారెయందు, వర్తినః = ఉండునవియై, అనగా ముద్దగాచేయఁబడి చక్రమందుంచబడినవియై, భద్రభాజనం=శుభమైనపాత్రగా, జాయంతే=అగుచున్నవి. తే భద్రభాజనం, అనుప్రయోగము, వేదాః ప్రమాణం స్మృతయః ప్రమాణం, అనునట్లు సాధువుగాగ్రహింపదగు.

తా. మిక్కిలి సూక్ష్మములైన భూపరమాణువులు పిండభావమునుబొంది సారెయందుండి సంతోషకరమైన ఘటాదిమహద్రూపమును బొందులాఁగున రాజులగువారు కొంచెముబలముగలవారై యుండినను, గొప్పకార్యము నారంభించిరేని సార్వభౌమపదవినిబొందుదురు. "ఉద్యమేనహిసిద్ధ్యంతి కార్యాణి నమనోరథైః" "ఉద్యోగినం పురుషసింహముపైతిలక్ష్మీః" అని యుండుటచే నెట్టియల్పుడైననుచక్కఁగా పాటుబడి గౌరవమును సంపాదించుకొనవలయునుగాని సోమరితనముతో నుండరాదు. ౫౧.

శ్లో. వశీకరోతిపురుషః సమస్తానపిదానవాన్,
స్వమహిమ్నాతథాహంతి సమస్తానపిదానవాన్. ౫౨.

---

* చంద్రభాజనం=ఆహ్లాదమునకుగాని లేక కర్పూరమునకుగాని యర్థమగును.

టీ. దానవాన్ = ఈవిగల, పురుషః = మనుష్యుఁడు, సమస్తానపి = అందఱిని, వశీకరోతి = స్వాధీనులనుగా జేసికొనుచున్నాఁడు. తథా = అట్లే, సమస్తానపి = సమస్తమైన, దానవాన్ = రాక్షసతుల్యులగుశత్రువులను, స్వమహిమ్నా = తమదానమాహాత్మ్యము చేత, హంతి = చంపుచున్నారు.

అర్థాంతరము. పురుషః = పూర్ణుడగుటచేతను, శరీరములనుండుటచేతను బురుష వాచ్యుడగు విష్ణువు, స్వమహిమ్నా = తనగొప్పతనముచేత, లేక మాయచేత, సమస్తానపి = సకలప్రాణిసమూహములను, వశీకరోతి = తన మాయకులోబడిన వానినిగా జేయుచున్నాడు, తథా = అలాగుననే, దానవాన్ = ఈవిగలవాఁడై, లేక విదారణగుణముగలవాఁడై, సమస్తానపి = సమస్తమైన, దానవాన్ = రాక్షసులను, హంతి = చంపుచున్నాడు.

తా. పరమాత్మయగు విష్ణువు తనమాయాబలముచే సకల ప్రాణులను వశము చేసికొని సాధురక్షణకై రాక్షసులను శిక్షించునట్లు పురుషుఁడు వితరణశీలుఁడై, తన మాహాత్మ్యముచేత నందఱినివశపఱచుకొని రాక్షసులతో సమానులగు శత్రువులను జయించవలయును. ౫౨.

శ్లో. యత్రస్మృతేఽపినారీణాం నిర్వృతింలభతేమనః,
సదర్పకోపమానానాం సీమాపురుషఉచ్యతే. ౫౩.

టీ. యత్ర = ఏరాజు, స్మృతేసతి = స్మరింపబడినవాఁడుకాగా, అరీణాం = శత్రువులయొక్క, మనః = మనస్సు, నిర్వృతిం = సుఖమును, నలభతే = పొందదో, సః పురుషః = ఆరాజు, దర్పకోపమానానాం = సాహస రోష అభిమాన గుణములకు, సీమా = ఎల్లయని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నాడు. అనఁగా నెక్కుడైన యుద్ధోత్సాహాదిగుణములుగలవాఁడని పొగడబడుచున్నాడు.

అర్థాంతరము. యత్ర = ఏసుందరపురుషుఁడు, స్మృతేసతి = స్మరింపఁబడినవాఁడుకాఁగా, నారీణాం = స్త్రీలయొక్క, మనః = మనస్సు, నిర్వృతిం = సుఖమును, లభతే = పొందుచున్నదో, సః పురుషః = ఆపురుషుఁడు, దర్పకోపమానానాం - దర్పక = మన్మథునితోడ, ఉపమానానాం = సమానులగువారికి, సీమా = ఎల్లయని, ఉచ్యతే = పలుకబడును.

తా. ఏరాజును దలంచుకొన్నంతలోనే శత్రువులమనస్సు కలతనొందునో యారాజే సాహసము రోషమును అభిమానమునుగల వారలలో శ్రేష్ఠుడనియును, ఏపురుషుని దలంచినంతనే స్త్రీలమనంబు సుఖంబొందునో అట్టిపురుషుడే సుందరముగల వారలలో శ్రేష్ఠుఁడనియును భావము. ౫౩.

శ్లో. భ్రమేణమహితంనీచై ర్గత్వాదాయజీవనం,
క్షేత్రేదత్తేఘటీయంత్ర మక్షేత్రేబాలిశోజనః. ౫౪.

టీ. ఘటీయంత్రం = ఏతము అను జలయంత్రము, నీచైః = క్రిందుగా, అనగా బావిలోనికి, గత్వా = పోయి, మహితం = పూజింపదగిన, అనగా స్నానాదులకు యోగ్యమైన, జీవనం = నీటిని, భ్రమేణ = తిరుగుటచేత, ఆదాయ = తీసికొని, క్షేత్రే = పంటనూమియందు, దత్తే = విడుచుచున్నది.

అర్థాంతరము. బాలిశః = తెలియనివాఁడు, నీచైః = కొరగానివానిని, గత్వా = పొంది, మహితం = యోగ్యమైన, జీవనం = బ్రతుకును, ఆదాయ = ప్రయాసచే సంపాదించి, భ్రమేణ = భ్రాంతిచేత, అనగా నవివేకముచేత, అక్షేత్రే = పాత్రులుకానియట్టి జనులందు, దత్తే = ఇచ్చుచున్నాఁడు.

తా. జలయంత్రము లోతుగానుండు బావిలోపలికి తిరుగుడు మూలకముగాదిగి అందలినీటిని పంటభూముల కొసంగుచున్నది. మూర్ఖుడుగువాడు నీచునియొద్దకేగి వానివలన తనజీవనమునకు వలయుదానిని గ్రహించిమోహముచే నపాత్రులగు నటులువిటులు వారవధూటులు మొదలగువారికి నిచ్చుచున్నాఁడు. ఇందుమూర్ఖుఁడును జలయంత్రమును నీచజీవన గ్రహణమందు సమానులైనను జలయంత్రము సుక్షేత్రమున నుపయోగముగుటచే అపాత్రుల కుపయోగమగు మూర్ఖునికంటె నుత్తమంబనిభావము.

వ్యాఖ్యానమున అపాత్రులగు భ్రాత్రాదులకు మూర్ఖుఁడు జీవనమిచ్చుచున్నాడని వ్రాసినారు. భ్రాత్రాదులను అపాత్రులనుట లోకశాస్త్ర విరుద్ధము కదా? ౫౪.

శ్లో. అధిగమ్యాశుగోలక్ష మేకశ్శామ్యతిమార్గణః,
అధిగమ్యాశుగోలక్ష మేకశ్శామ్యతిమార్గణః. ౫౫.

టీ. ఆశుగః = శీఘ్రముగా పోవుచుండు, ఏకః = ఒకటైన, మార్గణః = బాణము, లక్షం = గుఱిని, అధిగమ్య = పొంది, శామ్యతి = శాంతినిబొందుచున్నది.

అర్థాంతరము. ఏకః = వేరొకటైన, మార్గణః = యాచకుడు, ఆశు = శీఘ్రముగా = గోలక్షం = లక్షగోవులను, అధిగమ్య = సంపాదించి, శామ్యతి = సంతుష్టిబొందుచున్నాఁడు.

తా. బాణమువలెనే తిరుగుచునుండు యాచకుడు బాణమేలాగున గుఱినిజెందియూరకుండునో, అట్లే యాచకుడును లక్ష గోవులను సంపాదింపకగాని శాంతిని బొందడు. ఇందు సముద్గకయమకమను శబ్దాలంకారముగలదు. మరియు నీ శ్లోకము గోమూత్రికా బంధమునకు నుక్త దగియున్నది.

౫౬.

శ్లో. ఇనస్సఏవ సేవ్యోయ స్స్వలోకేనసుధాముచా,
ద్విజేంద్రమండలంక్షీణం సమగ్రయతిసంపదా ౫౮.

టీ. యః=ఏపురుషుఁడు, క్షీణం=దరిద్రమైన, ద్విజేంద్రమండలం = ద్విజేంద్ర =బ్రాహ్మణోత్తములయొక్క, మండలం = సమూహమును, సంపదా = సమృద్ధిచేత, సమగ్రయతి = పూర్ణనిగా జేయుచున్నాడో, సఏవ = అట్టి, ఇనః=దొర, సుధాముచా=పాలుంబోలి పలుకులాడునట్టి, స్వలోకేన=బంధుజనముచేత, సేవ్యః=ఆశ్రయింపఁదగినవాఁడగుచున్నాఁడు.

అర్థాంతరము. యః=ఏసూర్యుడు,సుధాముచా=చంద్రకిరణ రూపమైన యమృతమును స్రవించునట్టి, సంపదా=కిరణసమృద్ధిచేత, క్షీణం=నష్టమైన, ద్విజేంద్రమండలం = చంద్రమండలమును, సమగ్రయతి = సంపూర్ణముగా జేయుచున్నాఁడో, సః=అట్టి ఇనఏవ = సూర్యుఁడే, స్వలోకేన=తనభక్తజనముచేత,సేవ్యః = సేవింపఁదగిన వాఁడగుచున్నాడు.

తా. అమృతము నుత్పాదించు స్వకిరణములచేత కృష్ణపక్షమందు క్షీణదశనొందిన చంద్రమండలమును సంపూర్ణముగా నొనర్చు సూర్యుడు స్వభక్తజనములచే నెట్లు సేవింపదగినవాడో యట్లే తనసంపదచేత బ్రాహ్మణులనుపూర్ణమనోరథులనుగా జేయు ప్రభువే హితముగా బలుకుచుండు స్వబంధుజనముచేతసేవింపదగినవాడగుచున్నాఁడు. క్షయంబొందిన చంద్రుడు సూర్యకిరణములచేతనే మరల కలావంతుడగుచున్నాడనుటకు బ్రమాణము „శ్లో. సలిలమయేశశినిరవే ర్దీధితయోమూర్ఛితాస్తమోనైశం, క్షపయంతిదర్పణోదర నిహితా ఇవమందిరస్యాంతః.” అని వరాహమిహిరాచార్యులు చెప్పియుండుటచే, జలరూపగు చంద్రమండలమందు సూర్యకిరణములు పడుటవలన నింటిలోపలి యద్దమునందు ప్రతిఫలించిన సూర్యకిరణము లాయింటగల చీకటినెట్లు హరించునో యట్లే రాత్రిగలిగిన చీకటిని పరిహరించునని తెలియవలయును. ౫౮.

శ్లో. బాల్యేకామమవృత్తోస్తు వృద్ధస్స్యాదధికంజడః,
స్వాంతశ్చకృష్ణరూపశ్చ త్స్యాత్సరాజాద్విజన్మనాం ౫౯.

టీ. బాల్యే = ఉపనయనము కాకమున్ను, కామం = ఇచ్ఛవచ్చినట్లుగా, అవృత్తః = ఆచారహీనుడు, అస్తు=కావచ్చును. వృద్ధః=ముదుసలియై, అధికం= మిక్కిలి, జడః=అసమర్థుడు, స్యాత్ = కావచ్చును. (తథాపి=అట్లయినను) స్వాంతః= తనహృదయమందు, కృష్ణరూపః — కృష్ణ=విష్ణువుయొక్క, రూపః = ఆకారము గలవాడు,

అనఁగా పరమాత్మను ధ్యానించువాఁడు, చేత్ = అయ్యెనేని, సః = ఆపురుషుఁడు, ద్విజన్మనాం = బ్రాహ్మణులకు, లేక బ్రహ్మక్షత్రియవైశ్యులకు, రాజా=రాజు, స్యాత్ = అగును.

అర్థాంతరము. బాల్యే = శుక్లపక్షాదియందు, అవృత్తః = వర్తులము లేనివాఁడు, అస్తు = అయినను, వృద్ధః = సంపూర్ణమైనకళలుగలవాఁడయి, అధికం=మిక్కిలి, జడః = చల్లనైనవాఁడు, స్యాత్ = అయినను, స్వాంతః=తనమండలమధ్యమందు, కృష్ణరూపః = నల్లనిరూపముగల, సః = ఆచంద్రుడు. ద్విజన్మనాం = బ్రాహ్మణులకు, రాజా=దొర, స్యాత్ = అగును.

తా. చిన్నతనమందు పూర్ణచంద్రుడు కానందున వర్తులములేకయున్నను, వృద్ధత్వమనఁగాపూర్ణచంద్రుఁడైనపుడుమిక్కిలిచల్లనైనచంద్రుడుమధ్యమందుకప్పుగలవాఁడై బ్రాహ్మణులకు రాజైనచందమున పురుషుడు చిన్నతనమందు ఉపనయనముగాక మునుపు ఆచారవిహీనుఁడై యుండినను ముసలితనమున నింద్రియ దౌర్బల్యముచేత నేమియుఁజేయ లేనివాడైనను తనమనమునందుశ్రీకృష్ణమూర్తినిధ్యానించుచుండెనేని యందఱికంటె శ్రేష్ఠుడగును. శ్లో. ఇజ్యాచారదమాహింసా దానస్వాధ్యాయ కర్మణాం, అయంతుపరమోధర్మో యద్యోగేనాత్మదర్శనం. అనియాజ్ఞవల్క్య వచనమువలన నన్ని కర్మలకంటె నాత్మభావనశ్రేష్ఠము. ౨౭.

శ్లో. విలక్షణతయారాజా బాలఏవభృశోజ్జ్వలః,
లబ్ధ్వావృద్ధింప్రతికలం భాత్యఖండితమండలః. ౨౮.

టీ. బాలః=చిన్నవాఁడైన, రాజా = రాజు, విలక్షణతయైవ, అందఱికంటె నెక్కుడైనమంచిగుణములచేతనే, భృశోజ్జ్వలః -భృశ=మిక్కిలి, ఉజ్జ్వలః=ప్రకాశించువాఁడగుచున్నాఁడు. ప్రతికలం=ధనవృద్ధిచేత. వృద్ధిం=అభివృద్ధిని, లబ్ధ్వా = పొంది, అఖండితమండలః-అఖండిత=నాశముకానియట్టి, మండలః=దేశముగలవాఁడై, భాతి=ప్రకాశించుచున్నాఁడు.

అర్థాంతరము. రాజా=చంద్రుఁడు, బాలఏవ=చిన్నవాఁడయ్యే, అనగా రేఖామాత్రరూపముగలవాడయ్యే, విలక్షణతయా = కలంకములేనికారణముచే, భృశోజ్జ్వలః= మిక్కిలిప్రకాశించువాడగుచున్నాడు. తథా=అట్లే, ప్రతికలం= ఒక్కొక్క కలయందును, వృద్ధిం=అభివృద్ధిని, లబ్ధ్వా=పొంది, అఖండితమండలః= సంపూర్ణ బింబము గలవాఁడై, భాతి=వెల్గుచున్నాఁడు.

తా. చంద్రుఁడు శుక్లపక్షపాడ్యమినాడు రేఖామాత్రదృశ్యమానుఁడై కలంక రహితుడై మిక్కిలి ప్రకాశించుచు దినదినము కలావృద్ధిగలిగి యెవ్విధమున సంపూర్ణ బింబముతో తేజరిల్లునో, అట్లే రాజగువాఁడు బాల్యమందే సర్వోన్నతములైన శౌర్యౌదార్యాది సద్గుణములుగలవాఁడై ధనాభివృద్ధిచే నఖండమండలాధిపత్యంబు వహించి ప్రకాశించుచున్నాఁడు. ౫౮.

శ్లో. ముక్తామృణాళసుధియాం నిర్మలానాంనిసర్గతః,
ఛిద్రంయదిస్యాత్తత్ క్షుద్రం తద్గుణై రపిధీయతే. ౫౯.

టీ. నిసర్గతః = స్వభావమువలన, నిర్మలానాం = నిర్దోషములైనట్టి, అనఁగా స్వచ్ఛములైనట్టి, ముక్తామృణాళసుధియాం- ముక్తా=ముత్యములకు, మృణాళ = తామర తూండ్లకు, సుధియాం = విద్వాంసులకు, క్షుద్రం = కొంచెమైన, ఛిద్రం-రంధ్రమును, దోషమును, స్యాద్యది=కలిగెనేని, తత్క్షుద్రం = ఆరంధ్రమును, దోషమును, తద్గుణైః - తత్ = వానియొక్క, గుణైః = సూత్రములచేతను, మంచినడతలచేతను, అపిధీయతే= కప్పబడుచున్నది.

తా. స్వభావముచేతనే తెల్లనైన ముత్యములకును తామరతూండ్లకును స్వభావముచేతనే దోషరహితులైన విద్వాంసులకును ఛిద్రములు అనఁగా ముక్తామృణాళములకు రంధ్రములును విద్వాంసులకు దోషమును కలిగినయెడల, ఆదోషములు ముక్తామృణాళములకు దానియందలి సూత్రముచేతను, విద్వాంసులకు వారిసుగుణములచేతను ఆచ్ఛాదింపబడుచున్నది. ముత్యములకుదారమును, తామరతూండ్లకువానియందలినూలును, విద్వాంసులకు వారి సుగుణములును ఆరంధ్ర దోషములను పోగొట్టును. “ఏకోహి దోషోగుణసన్నిపాతే నిమజ్జతీం దోః కిరణేష్వివాంకః” అను న్యాయమున జగదాహ్లాదకరుడైన చంద్రునియందుండు కంకెవ్విధమున నెన్నబడదో అట్లే యనేక సుగుణములుండి యొకానొక దోషముండినను బయలుపడదు. ౫౯.

శ్లో. వివృణ్వతిపురస్తైక్ష్ణ్యం పృష్ఠతఃకుర్వతీగుణాం,
కర్ణాక్షవిధతిలోకస్య సూచీవాసూచికస్యవాక్. ౬౦.

☞ ఈ శ్లోకమందు అసూచికః అనిపదవిభాగము చేసినారు. సూచకినినూచకునివాక్కునకు నుపమానోపమేయ భావముండుటచే ననూచికవాక్కునకుపమానము పొసగదు. కాన తొలుత వ్యాఖ్యననుసరించి యర్థమువ్రాసి పిదప నాయభిప్రాయార్థమును వ్రాయుచున్నాఁడను.

టీ. అసూచికస్య = కొండెము చెప్పనివానియొక్క, అనగా సజ్జనునియొక్క, వాక్ = మాట, పురః=ప్రథమోపదేశ సమయమందు, తైక్ష్ణ్యం=కఠినభావమును, వివృణ్వతీ = ప్రకాశపరచునదియై, పృష్ఠతః = ఉపదేశానంతరమందు, గుణం = హితమును కుర్వతీ=చేయునదియై, లోకస్య=జనముయొక్క, అనగా నవివేకులయొక్క, కర్ణాన్ = చెవులను, పురః=ముఖమందు, తైక్ష్ణ్యం = వాడితనమును, వివృణ్వతీ = విస్తరించునదియై, పృష్ఠతః = వెనుకప్రక్క, గుణం = దారమును, కుర్వతీ = ధరించుచు, లోకస్య = జనముయొక్క, కర్ణాన్ = చెవులను, సూచీవ = సూదివలెనే, విధతి = పొడుచుచున్నది. అనగా వినుటకసహ్యమాచున్నది.

తా. మొనగల ముఖభాగమును వెనుక దారమునుగల సూదివలెనే హితవాదియగువాడు హితముపదేశించువేళలో పరుషముగా పలుకుచు పరోక్షమందు మంచిగుణములనే చెప్పుచు చెవిని వేధించుచున్నాడని యర్థము "హితంమనోహారిచదుర్లభం వచః." అను న్యాయమున లోకమందు ఇష్టమును హితమును అయినపలుకరుదనిభావము.

అర్థాంతరము. సూచికస్య=కొండెముచెప్పువానియొక్క, వాక్=పలుకు, పురః=జనులముందర, తైక్ష్ణ్యం=దోషోద్ఘాటనముచేతనైనకాఠిన్యమును, వివృణ్వతీ=విస్తరించునదియై, గుణం = మంచినడతను, పృష్ఠతః = వెనుకను, అనగా ప్రకాశము కానట్లుగా, కుర్వతీ=చేయునదియై, లోకస్య = వినువారియొక్క, కర్ణాన్ = చెవులను, సూచీవా = సూదివలెనే, విధతి = గ్రుచ్చుచున్నది.

(సూచీపరమైన యర్థము మొదటనే వ్రాయబడియున్నది.)

తా. ముఖముందు మొనగలదియై వెనుకప్రక్క దారముగలదియై చెవులనుగ్రుచ్చి నొప్పించునట్టి సూదివలెనే కొండెము చెప్పువానివాక్కు ముఖమున పరుషము గలదియై గుణమును ప్రకాశపరచక వినువారి చెవులకసహ్యముగా నుండుననిభావము. ఈ శ్లోకమందు, సూచీవా సూచికస్య వాక్, అనుచోట, సూచీ+ఇవ+అసూచికస్య, అనియే సంధిచేయ పనిలేదు. ఇహార్థేవశబ్దో వాశబ్దోవాబోధ్యః, అను వార్తికమువలనను; వావి లోప్యుపమానయోః, అను నానార్థరత్నమాలా వాక్యమువలనను; సూచీ-వా-సూచికస్య అనివ్యస్తపదముగానే తెలియవలయును. వశబ్ద వాశబ్దము లుపమానవాచకమునందు వర్తించును. ఇందుకుప్రయోగము:—మణీవోష్ట్రస్య లంబేతే ప్రియౌవత్సతరౌమమ. ఇట య్వోద్విత్వే. ఈకారాంత ఊకారాంత ఏకారాంత శబ్దోద్విత్వే వర్తమానః సంధింనప్రాప్నోతి మణీవాదివర్జ్యం. అని సారస్వత వ్యాకరణమందు ప్రకృతి భావ సంధియందు చెప్పి, మణీ-ఇవ - అనియే చెప్పవలయుననియు; కాశికయందును ఇట్లె మణీవ-దంపతీవ- దంపతీవ, అనిసంధిగా చెప్పియుండినను, సిద్ధాంత కౌముదియందు

ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యం. అను సూత్రవృత్తియందు వశబ్దో-వాశబ్దో వా బోధ్యం. అని ఈస్పష్టముగా చెప్పినారుగాన, వా శబ్ద ముపమానవాచకమనుటకే సందియంబును లేదు.

శ్లో. యోగిధీరర్కదీప్తిశ్చ ప్రాచీనతమసఃక్షయాత్,
క్రమాద్దీప్తా పరాం కాష్ఠాం యాతి కామం విహాయసా. ౬౧.

టీ. ప్రాచీనతమసః-ప్రాచీన=పూర్వజన్మము వలనగలిగిన, తమసః=అజ్ఞానము యొక్క, క్షయాత్=నాశమువలన, కామం=కామక్రోధాదులను, విహాయ=విడిచి, క్రమాత్ = యమనియమాద్యనుష్ఠానక్రమము చేత, దీప్తా= హృదయమందు ప్రకాశించుచుండు, సా = అట్టి, యోగిధీః—యోగి = ధ్యానమును జేయువారియొక్క, ధీః = బుద్ధి, పరాం=ఎక్కుడైన, కాష్ఠాం = శ్రేష్ఠత్వమును, యాతి = పొందుచున్నది.

అర్థాంతరము. అర్కదీప్తిశ్చ - అర్క = సూర్యునియొక్క, దీప్తిశ్చ=కాంతి యును, ప్రాచీనతమసః=పూర్వదిక్కునందలి చీకటియొక్క, క్షయాత్=నాశమువలన, దీప్తా=ప్రకాశించినదియై, క్రమాత్= కాలక్రమముచేత, కామం = సంపూర్ణముగా, విహాయసా=ఆకాశమార్గముచేత, పరాం కాష్ఠాం=పడమటిదిక్కును, యాతి=పొందు చున్నది. అనగా అస్తమించుచున్నదనుట.

తా. ప్రాచీనమైన తమస్సును పరిహరించుటవలనను కామాదులను విడుచుట వలనను యోగియొక్క బుద్ధి మిక్కిలి శ్రేష్ఠత్వమును బొందునటుల సూర్యుని కాంతి యును ప్రాచీన తమస్సును (తొలిదిక్కు చీకటిని) పరిహరించి యాకాశమార్గముచేత పడమటిదిక్కును బొందుననిభావము. ౬౧.

శ్లో. కుముదైశ్చ కుభూపైశ్చ వనేసంకుచితైరపి,
ప్రాప్యతే సా వికాసశ్రీ రాభిముఖ్యం గతే విధౌ. ౬౨.

టీ. వనే=జలమందు, సంకుచితైరపి=ముడుచుకొనియుండునవియైనను, కుముదైః=తెల్లకలువలచేతను నల్లకలువలచేతను; విధౌ=చంద్రుడు, ఆభిముఖ్యం= అభిముఖ భావమును, గతేసతి=పొందినవాడుకాగా, సా=ప్రసిద్ధమైన, వికాసశ్రీః=వికసనసమృద్ధిని, ప్రాప్యతే=పొందబడుచున్నది.

అర్థాంతరము. వనే=అడవియందు, సంకుచితైరపి= అణగికొనియుండువారైనను, కుభూపైః= అసమర్థులగురాజులచేత, విధౌ = భాగ్యము, లేక విష్ణువు, అభిముఖ్యం= ప్రసన్నభావమును, గతేసతి=పొందుచుండగా, సా=ప్రసిద్ధమైన, వికాసశ్రీః=ఐశ్వర్యమును విస్తరింపజేయుసంపద, ప్రాప్యతే=పొందబడుచున్నది.

తా. జలమునందు ముకుళభావమునుబొంది తమ వికసనమునకు నేమియు బ్రయత్నమొనరింపక యుండు తెల్లకలువలు మొదలగువానికి తనంతన యుదయమైన చంద్రునివలన వికాససంపద గలిగినట్లు, గ్రహచారవశమున నడవియందు దాగియుండు పేదలైనరాజులకు అదృష్టవశమున రాజ్యసంపదలు గలుగుచున్నవని యర్థము «యద్భావి తద్భవత్యేవ యదభావి నతద్భవేత్» అను నియతిననుసరించి ఫలప్రాప్తి విషయమందు అదృష్టమె బలమైనదికాని పురుషప్రయత్నము ప్రయోజనకారి కాదు. ౬౨.

శ్లో. భూభుజామంబుజానాంచ పత్రకోశవతామపి,
దోషాన్వయాద్వ్యసనినాం సంకుచంతిధ్రువంశ్రియః. ౬౩.

టీ. పత్రకోశవతామపి-పత్ర = వాహనములు, కోశవతాం = బొక్కసముగల, భూభుజాం=రాజులయొక్క, శ్రియః=సంపదలు, వ్యసనినాం=వేటమొదలగు వ్యసనములుగల పురుషులయొక్క, దోషాన్వయాత్ = సహవాసదోష సంబంధమువలన, సంకుచంతి=సంకోచమును బొందుచున్నవి. అనఁగా నాశమగుచున్నవి.

అర్థాంతరము. పత్రకోశవతామపి - పత్ర = దళములందు, కోశవతామపి = ముకుళనముగలిగియుండినను, వ్యసనినాం=ఆపదబొందిన, అనఁగా శిధిలమగుచునుండు అంబుజానాం = తామరలయొక్క, శ్రియః = నూతన వికసనాదిసంపదలు, దోషాన్వయాత్-దోష=రాత్రియొక్క, అన్వయాత్=రావడమువలన, సంకుచంతి=తగ్గుచున్నవి, ధ్రువం=సత్యము.

తా. ఏనుగులు గుఱ్ఱములు మొదలగు వాహనములును బొక్కసమును గలిగియున్నను స్త్రీద్యూతపానాది వ్యసనాసక్తులగు వారితోఁగూడిన దోషమువలన రాజుయొక్క సంపదలు నశించుచున్నవి. శ్లో. వీతవ్యసనమాక్రాంతం మహోత్సాహంమహామతిం, ప్రవిశంతిసదాలక్ష్మ్యః సరిత్పతిమివాపగాః, సత్త్వబుద్ధ్యుపపన్నోఽపి వ్యసనాసక్తమానసః, శ్రీభిష్షండఇవస్త్రీభి ర్భుసఃపరిభూయతే. అనికామందకము. అనఁగా, వ్యసనములనొందువాడు చెడునని భావము. రేకులందు ముకుళనము గల పద్మములు రాత్రిసంబంధమువలన తమకాంతిని బాయుచున్నది. ౬౩.

శ్లో. మంత్రప్రభావసంపన్నా యేనరేంద్రాస్సమాహితాః.
నుదంత్వహింభయంనిత్యం వినాదండోద్యమేనతే. ౬౪.

టీ. యేఏ, నరేంద్రాః=రాజులు, మంత్రప్రభావసంపన్నాః=మంత్ర=ఆలోచనయొక్క, ప్రభావ=మహిమతోడ, సంపన్నాః=కూడినవారై, సమాహితాః=సామాద్యు

పాయములందు నిశ్చయమైనమనస్సుగలవారో, తే=ఆరాజులు, దండోద్యమేనవినాపి= దండోపాయమును విడిచినప్పటికిని, నిత్యం=సైజమైన, అహిభయం=స్వపక్షమువలన గలిగినభయమును, నుదంతి=నివారించుచున్నారు,

అర్థాంతరము. యే-ఏ=నరేంద్రాః=విషవైద్యులు, మంత్రప్రభావసంపన్నాః= మంత్ర=గారుడాదిమంత్రములయొక్క, ప్రభావ=మాహాత్మ్యముతోడ, సంపన్నాః= కూడినవారై, సమాహితాః=ఔషధాది ప్రయోగములందు జాగ్రతగలిగి యున్నారో, తే=ఆవిషవైద్యులు, దండోద్యమేన-దండ=కోలచేత, ఉద్యమేన = కొట్టడముచేత, వినాపి=లేకుండినను, నిత్యం=స్వభావసిద్ధమైన, అహిభయం=పాముపలనిభయమును, నుదంతి=నివారించుచున్నారు.

తా. దొరతనమొనరించువారు రాజనీతిదెలిసినవారై తమయాలోచనలను గోప్యముగానుంచుకొని సామాద్యుపాయములచేతనే రాష్ట్రసమాధానమును గావించుచు,దండోపాయమును విడిచియైనను విషవైద్యులగువారు గారుడాదిమంత్రప్రభావముచేత సర్పములవలనిభీతిని నివారించుకొనుచందమున, స్వపక్షమువలని భయమును బాపుకొందురు. శ్లో. సామ్నా భేదేనదానేన సమస్తైరథవాపృథక్, విజేతుంప్రయతేతారీన్ నయుద్ధేనకదాచన. అనిమనుస్మృతియందుండుటచే రాజులుసామదానభేదములచేతనే శత్రువులను జయించవలయునుకాని దండోపాయము సర్వదాకూడదనిభావము. శ్లో. షాడ్గుణ్యనిశ్చితమతి ర్గుహ్యంగూఢప్రచారవాన్, మంత్రయేదిహమంత్రజ్ఞో మంత్రజ్ఞైస్సహమంత్రిభిః, మంత్రార్థకుశలో రాజా సుఖంభూతింసమశ్నుతే, విపరీతస్తువిద్వద్భిః స్వతంత్రోఽప్యవధూయతే, ప్రభావోత్సాహశక్తిభ్యాం మంత్రశక్తిః ప్రశస్యతే'' అని కామందకము. అనగా గుప్తమైనయాలోచనయే శ్రేష్ఠమని తెలియందగు. ౨౪.

శ్లో. ప్రభావమీశ్వరస్యాపి కోదండేననివర్తయన్,
ప్రాప్నోతివిజయశ్లాఘాం నరః పౌరుషమాశ్రితః. ౨౫.

టీ. పౌరుషం=పురుషప్రయత్నమును, ఆశ్రితః = పొందినట్టి, కః=ఏ, నరః= మనుష్యుడు, ఈశ్వరస్య = స్వామియొక్క, ప్రభావం=శ్రేష్ఠమైన యైశ్వర్యమును, "భావోలాన క్రియాచేష్టా భూత్యభిప్రాయజంతుషు" అని యాదవుడు. దండేన=దండోపాయముచేత, లేక సైన్యముచేత, నివర్తయన్ = అపహరించినవాడై, విజయశ్లాఘాం-విజయ=గెలుపునిమిత్తమైన, శ్లాఘాం= పొగడుటను, ప్రాప్నోతి = పొందుచున్నాఁడు? అనఁగా పొందఁడని కాకువు,

అర్థాంతరము. పౌరుషం=పరాక్రమమును, ఆశ్రితః =పొందిన ఔ, నరః=అర్జునుడు, ఈశ్వరస్యాపి=పరమేశ్వరునియొక్క, ప్రభావం = బలమును, కోదండేన=వింటిచేత, నివర్తయన్ = నివారించినవాఁడై, విజయశ్లాఘాం-విజయ = జయముగలవాఁడనెడి, శ్లాఘాం=పొగడుటను, ప్రాప్నోతి=పొందుచున్నాఁడు.

తా. ఎవఁడు పురుష ప్రయత్నముచే తనయేలికయొక్క సంపదను దండోపాయముచేత నపహరించుచున్నవాఁడో అట్టి స్వామిద్రోహియగువాని పౌరుషము నెవ్వరును కొనియాడరు.

ఆర్జునుడుపరాక్రమమును వహించి తనధైర్యమెఱుంగవలయుననికిరాతవేషముతో వచ్చిన పరమేశ్వరుని సామర్థ్యమును తనగాండీవమనెడి వింటిచేత నివారించినవాఁడై విజయుఁడనెడి పొగడ్తనొందెననిభావము. ౬౫.

శ్లో. భిక్షాశనోవిషాదీచ సుహృద్యస్యధనేశితుః,
సంస్తూయతే కింపురుషైః రపదాన కర స్తథా. ౬౬.

టీ. యస్య=ఏ, ధనేశితుః=ధనవంతునియొక్క, సుహృత్ = స్నేహితుఁడు, అపదానకరః-అపదాన = మంచికార్యమును, కరః=చేయువాఁడై, భిక్షాశనః=తిరుపమెత్తియన్నముదినువాఁడగుటవలన, విషాదీ=దుఃఖముకలవాఁడగుచున్నాఁడో, సః=అట్టి ధనవంతుఁడు, పురుషైః=జనులచేత, స్తూయతేకిం=కొనియాడబడునాయేమి? అనఁగా లేదనుట.

అర్థాంతరము. యస్య = ఏ, ధనేశితుః=కుబేరునియొక్క, సుహృత్=మిత్రుఁడైన పరమేశ్వరుఁడు, భిక్షాశనః=బికిరమెత్తియోదనముదినువాఁడైనను, అవిషాదీ=దుఃఖములేనివాఁడును, అనగా ఆనందస్వరూపుఁడనుట, లేక విషాదీ = విషమును భక్షించినవాఁడును, అపదానకరః-అపదాన = ఖండనమును, అనగా గజాసురుని ఖండనమును, కరః=చేయువాఁడును. అయినాఁడో, సః=ఆకుబేరుఁడు, కింపురుషైః = కింపురుషులనెడి దేవతావిశేషములచేత, స్తూయతే= కొనియాడఁబడుచున్నాఁడు.

తా. ఏధనవంతుని మిత్రులు మంచి యాచారములుగలవారైయుండియు బికిరమెత్తి తినుటచే దుఃఖితులగుచున్నారో అట్టి ధనవంతుఁడు పురుషులచే కీర్తింపబడఁడు. తానుధనికుఁడైయుండియు మిత్రుల కుపకార మొనర్పని వాఁడు జనులచే నిందింపబడుచున్నాఁడనిభావము.

కుబేరునియొక్క మిత్రుఁడైన పరమేశ్వరుఁడు భిక్షాశనమును లీలచే నంగీకరించి, లోకమున కుపద్రవముచేయుచు నెవరిచేతను పరిహార్యముకానియట్టి విషమును పరిహరిం

చి లోకకంటకులైన గజాసురాది రాక్షసులను జంపినవాడగుటచే నట్టివానికి మిత్రుడై నయాకుబేరుడు కింపురుషులచే స్తుతింప బడుచున్నాడు. పూర్వమందు దేవదానవులుకూడి సముద్రమును మథించునెడ నందు హాలాహలముద్భవించి లోకములఁ గాల్ప పరమేశ్వరుండు దాని మ్రింగెననియు, దారుకావనమందలి ఋషులు గర్వముచే త్రిమూర్తుల నంగీకరించక నుండగా వారిమదమణంచుటకు పరమేశ్వరుండు మోహినీ రూపమును బూనిన విష్ణువుతోఁగూడి తానత్యంతసుందరాకారముతో భిక్షాటనవ్యాజముచేత నటకేగి వారిగర్వమడంచెననియును స్కాందపురాణకథగలదు. ౬౬.

శ్లో॥ దుర్భృత్యో దురుపానచ్చ ప్రాప్తోఽపిస్నేహసత్క్రియాం,
స్వామినః పదభంగాయ స్వకాఠిన్యేన కల్పతే. ౬౭.

టీ. దుర్భృత్యః=చెడ్డసేవకుడు, అనగా స్వామిద్రోహి, స్నేహసత్క్రియాం-స్నేహ = చెలిమిచేత, సత్క్రియాం = బహుమానమును, ప్రాప్తోఽపి = పొందినవాడైనను, స్వకాఠిన్యేన=తనస్వభావమైన చెఱుపుచేత, స్వామినః = ఏలినయొక్క, పదభంగాయ - పద=రాజ్యాదిరూపమైన యధికారముయొక్క, భంగాయ = నాశముకొఱకు, కల్పతే=సమర్థుడగుచున్నాడు.

అర్థాంతరము. దురుపానచ్చ=గడుసైనకాలిచెప్పు, స్నేహసత్క్రియాం-స్నేహ =నూనెచేత, సత్క్రియాం=తడపబడెడి సంస్కారమును, ప్రాప్తోఽపి=పొందినదియైనను, స్వకాఠిన్యేన = తనగడుసుతనముచేత, స్వామినః = తన్నుధరించుపురుషునియొక్క, పదభంగాయ - పద = కాలియొక్క, భంగాయ=పుండ్లవలన గలుగు నాశముకొఱకు, కల్పతే=సమర్థమగుచున్నది.

తా. స్వభావముచేత గడుసుగానుండు కాళ్ళచెప్పు నూనెచేతడపబడినప్పటికిని నిజకాఠిన్యముచేత మనుష్యునికాళ్ళకు ఒత్తుకొనుటవలన గలుగు వ్రణముచే పాదములను చెఱుచునటుల,దుష్టుడైన సేవకుడు స్నేహముచే సత్కారమును జెందినవాడైనను స్వభావదౌర్జన్యముచేత తనయేలికయొక్క యధికారమునకు కొఱతజేయుచున్నాడు. చెప్పులకు నూనె వేయుటయును అది యొత్తుకొని కాళ్ళయందు పుండ్లను గలిగించుటయును ప్రసిద్ధంబు. ౬౭.

శ్లో॥ ప్రసాదాతిశయేనాశు విస్ఫురత్సర్వసంపదః,
నదీనాథగవంతోఽపి సాధవస్సింధవోయథా. ౬౮.

టి. ప్రసాదాతిశయేన - ప్రసాద = మనోనైర్మల్యముయొక్క, అతిశయేన= అధికముచేత, ఆశు = వేగముగా, విస్ఫురత్సర్వసంపదః - విస్ఫురత్=ప్రకాశించు చుండెడు, సర్వ = సమస్తమైన, సంపదః=ఐశ్వర్యముగల, సాధవః=సత్పురుషులు, భగవంతోఽపి=శ్రీమంతులైనను, ప్రసాదాతిశయేన=ప్రసాద-ప్రకర్షమైన మథనము యొక్క, అతిశయేన = ఎక్కువచేత, ఆశు = శీఘ్రముగా, విస్ఫురత్సర్వసంపదః = ప్రకాశించుచుండు లక్ష్మీ మొదలగు సమస్తసమృద్ధిగలిగి, భగవంతః = లక్ష్మీగలవారై, నదీనాః - నదీ=నదులకు, ఇనాః = స్వాములైన, సింధవో యథా = సముద్రములవలె, నదీనాః = దీనులుగానివారు, అనగా లోభులుగానివారు, భవంతి=అగుచున్నారు.

తా. మిక్కిలి మథించుటవలన అమృతము కల్పవృక్షములు మొదలైనయైశ్వర్య ములుగలిగి లక్ష్మికి పుట్టినిల్లై ప్రకాశించుచు నదులకు నాథులగుసముద్రములవలె, సాధువు లగువారు మనోనైర్మల్యముచేత ప్రకాశించి సమస్తైశ్వర్యములుగలవారై శ్రీమంతులై నను లోభులుకాకుందురు. ఇచట శ్రీమంతులైనను లోభులు కారనుటకు, "లాభా ల్లోభః ప్రవర్తతే" అను న్యాయముచే లోకమందు లాభము కలుగుచుండగా లోభి తనముగలుగునని భావము. ౬౮.

శ్లో. క్షిపంతం మార్గణాన్ రోషాత్ కృత్రిమం లుబ్ధమీశ్వరం,
ప్రసాద్యనఫలస్యాప్త్యై కల్పతే కోఽప్యఫల్గునః. ౬౯.

టీ. రోషాత్ = లోభత్వమువలనగలిగిన కోపమువలన, మార్గణాన్ = యాచ కులను, క్షిపంతం= తిరస్కరించుచుండు, లుబ్ధం = లోభియైనట్టియు, కృత్రిమం = క్రొత్తయైనట్టియు, లేక కపటముగలట్టియు, ఈశ్వరం=రాజును, ప్రసాద్య=సంతోష పెట్టి, కోఽపి = ఒకానొకయాచకుడు, అఫల్గునః = శ్రేష్ఠమైనట్టి, "అసారంఫల్గు శూన్యంచ" అని అమరము. ఫలస్య = లాభముయొక్క, ఆప్త్యై= పొందుటకై, నక ల్పతే = సమర్థుడుకాడు.

తా. ధనాశచే యాచకునింగనినంతనే తిరస్కరించుచు లోభత్వముచే మోస తనమున మెలగు రాజును సంతోషపెట్టి యెవడు తానే శ్రేష్ఠమైనలాభము కొఱకు తగియున్నాడు. అనగా నెవడు నుతగడనుట.

అర్థాంతరము. రోషాత్ = మూకదానవ విషయకమైన కోపమువలన, మార్గ ణాన్= బాణములను, క్షిపంతం = విడుచుచునుండు, కృత్రిమం= కపటముచే వేష ము వేసికొనివచ్చిన, లుబ్ధం = కిరాతరూపుడైన, ఈశ్వరం = పరమేశ్వరుని, ప్రసా

ద్య= సంతోషపఱచి, ఫలస్య= పాశుపతాస్త్రలాభముయొక్క, ఆప్త్యై=ప్రాప్తి
కొఱకు, అఫల్గునః = అర్జునునికంటెవేరొకడు, కోఽపి = ఎవడైనను, నకల్పతే =
సమర్థుడుకాడు.

తా॥ ఇంద్రునిగూర్చి తపంబొనరించు వేళ వరాహరూపుడైన మూకరాక్షసుని
విషయకమైన రోషముచేత బాణములనువేయుచున్న మాయాకిరాతరూపుడైనపరమేశ్వ
రుని సంతోషపఱచి పాశుపతాస్త్రలాభమును పొందుటకు అర్జునుడే సమర్థుడు.

వేరొకయర్థము. రోషాత్ = కోపమువలన, మార్గణాన్ = అంబులను, క్షి
పంతం= గ్రుచ్చునట్టియు, కృత్రిమం = ఆకులు మొదలగు వానిచే శరీరమును దాచు
కొనియుండునట్టియు, ఈశ్వరం = వేటయందుసమర్థుడైనట్టియు, లుబ్ధం = బోయను,
ప్రసాద్య = పొంది, కోఽపి=ఏమృగము, అఫల్గునః = సారమైనట్టి, ఫలస్య = బా
ణాగ్రముయొక్క, ఆప్త్యై=ప్రాప్తికొఱకు, నకల్పతే = సమర్థముకాదా? అనగా
నగును.

తా॥ కోపముచే నల్లులన్ గ్రుచ్చుచు నాకులు మొదలగువానిచే తనయొడలు
ను మఱుగుచేసికొని మృగములను వంచించుసమర్థుడైన వేటకానియొక్క లక్ష్యమును
బొందిన ఏమృగమైనను బాణముపాలుకాకపోదు.

మరియొకయర్థము. రోషాత్=రాజ్యమందలి లోభమువలన, మార్గణాన్=యా
చకులైన దుర్యోధనాదులను, క్షిపంతం = తిరస్కరించుచుండునట్టియు, కృత్రిమం=
మాయామానుషవేషమును బూనినట్టియు, లుబ్ధం = మోహింపజేయునట్టియు, ఈశ్వరం
= భగవంతుడైన శ్రీకృష్ణుని, ప్రసాద్య = పొంది, అఫల్గునః= అర్జునునకంటెనన్యుడు,
కోఽపి= ఏపురుషుడును, ఫలస్య = కౌరవజయరూపమైన లాభముయొక్క, ఆప్త్యై
= ప్రాప్తికొఱకు, నకల్పతే = సమర్థుడుకాడు.

తా॥ రాజ్యమపహరించవలయునను లోభమువలనపుట్టిన రోషముచేత స్వపక్ష
మునకు సహాయకుడుగనుండవలయునని తనను యాచించిన దుర్యోధనాదులను తిరస్క
రించి కపటమానుషవేషధారియై భగవంతుడైన శ్రీకృష్ణునిన్ బొంది యర్జునుడు దుర్యోధ
నాది కౌరవులన్ జయించెను. చిన్నవాడైనను బలవత్సహాయముచే నుద్యుక్తకార్య
మును ముగింపజేయునని భావము. ౧౯.

శ్లో॥ అపథేనైవ యో మోహాదంధస్సారయతేస్వయం,
నీచోపసర్పణవశాత్స పతేద్వంశవానపి. ౨౦.

టీ. యః=ఏ, అంధః = గ్రుడ్డివాడు, అనగా తెలియనివాడు, నీచోపసర్పణ వశాత్ - నీచ = దురాచారులయొక్క, ఉపసర్పణ = అనుసరణమందలి, వశాత్ = కోరికెగలయట్టి, మోహాత్ = తెలివిలేమిచే, స్వయం= తనచేతనిషేధింపబడినట్టి. అపథేన = దురాచారముచేత, సారయతే=ఇతరులను బ్రవర్తింపజేయుచున్నాడో, సః= ఆపురుషుడు, వంశవానపి=మంచికులమందుపుట్టినవాడైనను, పతేత్=నరకమందుపడును.

అర్థాంతరము. యః = ఏ, అంధః = గ్రుడ్డివాడు, నీచోపసర్పణవశాత్-నీచ= బొరియలు మొదలగునవి గలతావున, ఉపసర్పణ = వెంబడిపోవడమందలి, వశాత్ = ఇచ్ఛగల, మోహాత్ = అజ్ఞానమువలన, అపథేనైవ = చెడ్డత్రోవచేతనే, స్వయం = తాను, సారయతే = నడిపింపజేయుచున్నాడో, సః = ఆగ్రుడ్డివాడు, వంశవానపి = హస్తమందు వెదురుకోలగలవాడైనను, పతేత్ = వంకలుమొదలగువానియందుపడును.

తా. కన్నులులేనివాడు తనచేతియందు వెదురు కఱ్ఱనుబట్టుకొని తెలివిలేక లోయలుగలనేలయందు ఇతరులనడిపించి తానే తొలుత వంకలోపడువిధంబున, తెలివిలేనివాడు దుర్మార్గులననుసరించవలయునను మోహముచే ఇతరులను దురాచారమందు ప్రవర్తింపజేసెనేని మంచి వంశమందు బుట్టినవాడైనను తానే నరకమందు పడును. సత్కులమే ప్రశస్తముకాదు, సదాచారంబుండవలయునని భావము. ౭౦.

శ్లో. యః క్షయేవర్తమానాం త్స్వాన్పాతిపుణ్యాజనాన్ధనీ,
లోకేమనుష్యధర్మాణం కిన్నరాః కథయంతితం ౭౧.

టీ. యః=ఏ, ధనీ = ధనవంతుడు, క్షయే = ఇంటియందు, వర్తమానాన్= ఉండువారిని, అనగా మానవంతులను, లేక క్షయే = లేమితనమందు, వర్తమానాన్= ఉండెడి, స్వాన్ = స్వకీయులైన, పుణ్యజనాన్=సత్పురుషులను, పాతి = కాపాడుచున్నాడో, తం = ఆధనవంతుని, లోకే = లోకమందు, నరాః = మనుష్యులు, మనుష్యధర్మాణం = మనుష్యమాత్రుడే అని, కథయంతికిం = చెప్పుచున్నారా ఏమి? అనగా నంతేకాదు, పురుషశ్రేష్ఠుడని చెప్పుచున్నారు.

అర్థాంతరము. యః = ఏ, ధనీ=ధనవంతుడైన కుబేరుడు, క్షయే = యుద్ధము మొదలగు దుర్వ్యాపారరాహిత్యమందు, వర్తమానాన్=ఉండెడి,స్వాన్=తనసంబంధులైనట్టి, పుణ్యజనాన్ = రాక్షసులను, అథవాయక్షులను. "పుణ్యజనస్తుసజ్జనే, గుహ్యకేయాతుధానేచ". అనిహేమచంద్రుడు. పాతి = రక్షించుచున్నాడో, తం = ఆకుబేరుని, కిన్నరాః = కిన్నరులనెడిదేవతలు, మనుష్యధర్మాణం = మనుష్యునివంటి ధర్మముగలవాడని, కథయంతి= గానముచేయుచున్నారు.

తా. తమతమయింద్రియందేయుండియే దుష్కార్యములకుపోక సాధువులుగా నుండునట్టియు, లేక దరిద్రావస్థయందుండునట్టియు స్త్రీయులను ఏధనవంతుడు పోషించుచున్నాడో అట్టివానికి లోకమండలిజనులు మానవోత్తముండని పొగడుచున్నారు. ధనాధిపత్యము వహించియు యుద్ధము మొదలగు చెడ్డ కార్యములు చేయకుండునట్టి తనవారైన రాక్షసులను అథవా యక్షులను రక్షించునట్టి కుబేరునికి కిన్నరుల్లు మనుష్యధర్మముగలవాడని పాడుచున్నారు. ౭౧.

శ్లో. ప్రకృష్టవర్ణతశ్శుద్ధం లబ్ధ్వాహారింసమేధితః.
తరళత్వేననత్యాజ్యో మణివజ్జాతిమాన్ద్విజః. ౭౨.

టీ. శుద్ధం=దోషరహితమైన, ఆహార్యం = అన్నమును, లబ్ధ్వా = పొంది, అనగాభక్షించి, సమేధితః = చక్కగాప్రకాశించుచుండెడి, జాతిమాన్ = మంచికులమందుపుట్టిన, ద్విజః = బ్రాహ్మణుడు, ప్రకృష్టవర్ణతః = శ్రేష్ఠకులముగలవాడగుటవలన, నత్యాజ్యః = త్యజింపదగిన వాడు కాడు.

అర్థాంతరము. శుద్ధం=నిర్మలమైన, హారం=ముత్తెపుసరమును, లబ్ధ్వా=పొంది, తరళత్వేన=హారమధ్యమండలి రత్న భావముచేత,సమేధితః=చక్కగా వెలుగుచుండెడి, జాతిమాన్=మంచిజాతిగలిగినట్టి, మణివత్ = రత్నమువలెనే, ప్రకృష్టవర్ణతః=మంచి కాంతిగలిగిన కారణమువలన, (నః ద్విజః=ఆబ్రాహ్మణుడు) నత్యాజ్యః=విడువదగిన వాడు కాడు.

తా. త్రాసము పటలము మొదలగుదోషములులేని ముత్తెములు మొదలగువానిచే గూర్పబడిన హారముల మధ్యమందు నాయకమణికారణముచే చక్కగాప్రకాశించుచు మంచికాంతిగలిగి జాతిరత్నమగుటచేత నామణి యేరీతిగా పోగొట్టతగినదికాదో, అట్లే పరిశుద్ధమైన యన్నమును భుజంచుచు, తేజోవంతుడై మంచివంశమందు పుట్టిన బ్రాహ్మణుడు శ్రేష్ఠవర్ణుడగుటవలన చాంచల్యముచేత విడువదగినవాడు కాడు. బ్రాహ్మణానావమన్తవ్యో భస్మచ్ఛన్నా ఇవాగ్నయః. అని మనుస్మృతి. బూడిదెచే గప్పబడిన నిప్పువలెనుండు బ్రాహ్మణుల నవమానింపరాదని భావము. ౭౨.

శ్లో. మందస్తీక్ష్ణరుచిః పాపః కుజన్మాయశ్చదేహినాం,
దుఃఖాయజన్మభజతే నిధనంచేత్రివిస్మయః. ౭౩.

టీ. యః = ఏపురుషుడు, మందః = సోమరితనముచే పరోపకారాదులందు అశక్తుడును, లేక మందః= తెలియనివాడును, తీక్ష్ణరుచిః = దారుణమైన యభిలాష

గలవాఁడు గనుక, పాపః = పాపముగలవాఁడై, కుజన్మా=దుష్కులమందుబుట్టినవాఁడో (సః=వాడు) జన్మ = తనపుట్టుకను, దేహినాం = ప్రాణులయొక్క, దుఃఖాయ = కష్టముకొఱకు, భజతే = పొందుచున్నాఁడు, (ఇదినగు) నిధనంచ = చావునుకూడ, దేహినాందుఃఖాయ= ప్రాణులకష్టమునకై, భజతే= పొందుచున్నాఁడు. ఇతి = ఇట్లునుట, విస్మయః = సంతోషకరమైనది. విస్మయోహర్షగర్వయోః. అనివిశ్వము,

అర్థాంతరము. యః=ఏ, మందః = శనిగ్రహమును, కుజన్మా=అంగారకగ్రహమును, తీక్ష్ణరుచిః = క్రూరమైనతేజస్సుగలవాఁడు, అనగా పాపగ్రహముగ చున్నాఁడు గనుకనే, దేహినాం = ప్రాణులయొక్క, దుఃఖాయ=కష్టముకొఱకు, జన్మ= లగ్నమును, నిధనంచ = అష్టమస్థానమును, భజతే = పొందుచున్నాఁడు, ఇతి = ఇది, విస్మయః = ఆశ్చర్యము.

తా. ఏనరుఁడు పరోపకారాదులు చేయలేక తెలివిలేనివాఁడై, క్రూరాభిలాషియైనవాడుగనుక పాపముచేయువాఁడై దుష్కులమందుపుట్టినాఁడో వాని జన్మము జనుల దుఃఖముకొఱకును చావు సంతోషముకొఱకును అగుచున్నదనియర్థము. దుర్జనుఁడు బ్రతికియుండుటకంటె చచ్చుటమేలనిభావము.

పాపగ్రహములైన శన్యంగారకులు జన్మమందును అష్టమ స్థానమందును ఉండి ప్రాణులకు ప్రాణాద్యుపద్రవములను జేయుచున్నారు. ఇందుకు, శ్లో. ద్వాదశాష్టమ జన్మస్థాః శన్యర్కాంగారకోగురుః, కుర్వంతి ప్రాణసందేహం స్థానభ్రష్టంధనక్షయం. అని శాస్త్రము. ౭౩.

శ్లో. వేదత్రయమయోయస్స్యాత్సోపిహీనఃక్షణాత్పతేత్,
స్వస్యైవరుచ్యాపీతాయాం వారుణ్యాం సత్పథాత్చ్యుతః. ౭౪.

టీ. యః = ఏబ్రాహ్మణుడు, వేదత్రయమయః = ఋగ్యజుస్సామములనెడి మూడువేదములను చదివి యర్థముదెలిసినవాడు, స్యాద్యది = అయినను, సోఽపి=వాడు, స్వస్యైవ = తనయొక్కయే, రుచ్యా = అభిలాషచేత, వారుణ్యాం = కల్లు, పీతాయాం సత్యాం= పానముచేయబడినదికాగా, సత్పథాత్ = మంచి యాచారము వలననుండి, చ్యుతః = జారినవాడుగనుకనే, హీనః = స్వజాతిలోతక్కువవాఁడై, క్షణాత్ = త్రాగువేళయందె, పతేత్ = పడుచున్నాఁడు. అనగా శ్రౌతాది కర్మభ్రష్టుడగుచున్నాఁడు.

అర్థాంతరము. వేదత్రయమయః = త్రయీస్వరూపుడైన, యః=ఏసూర్యుడు, సత్పథాత్ - సత్ = నక్షత్రములయొక్క, పథాత్ = మార్గమైన యాకాశమువలన

నుండి, చ్యుతః = జారుచు, స్వస్యైవ = తనయొక్కయే. రుచా = కాంతిచేత, హీనః = తక్కువైనవాడు, అనగా మందకాంతిగలవాడు, స్యాత్ = అగుచున్నాడో, సోఽపి = ఆసూర్యుడు, పీతాయాం = పచ్చనివన్నెగల, వారుణ్యాం = వరుణ సంబంధమైన పడమటి దిక్కునందు, పతేత్ = పడుచున్నాడు. అనగా అస్తమించుచున్నాడు.

తా. ఋగ్యజుస్సామములనెడి మూడు వేదములను జదివి వాని యర్థములను దెలిసికొనినవాడైనను తనయభిలాషచేత కల్లుద్రాగనేని సదాచారమువలననుండి జారినవాడై బ్రాహ్మణకులమందు హీనుడై తత్క్షణమందే శ్రౌతాదికర్మభ్రష్టుడగు చున్నాడు, బ్రాహ్మణుడగువాడు నిత్యముగా మద్యమును విడువవలయునని భావము. "నిత్యం మద్యంబ్రాహ్మణోవర్జయేత్" అని గౌతమస్మృతి.

వేదత్రయ స్వరూపుడైన సూర్యుడు ఆకాశమార్గమున దిరుగుచు నస్తమించు కాలమున మందతేజుడై వరుణదేవతాకమైన పశ్చిమ దిక్కునం దస్తమించు చున్నాడు.

శ్లో. ఏకక్షితి భృదుత్పన్నా స్సచ్ఛిద్రాః కంటకోల్బణాః,
మిథస్సంఘర్షితావంశా దహ్యంతే సానుగామినః ౨౫.

టీ. ఏకక్షితి భృదుత్పన్నాః-ఏక=ఒకడైన, క్షితిభృత్ = రాజుచేత, ఉత్పన్నాః = పుట్టినట్టియు, కంటకోల్బణాః - కంటక = నీచశత్రువులచే, ఉల్బణాః = వ్యాప్తులైనట్టియు, సచ్ఛిద్రాః = వేటమొదలగు దోషములతో కూడినట్టియు, సానుగామినః = అనుగాములనగా భృత్యులు వారితోగూడినట్టి, వంశాః = రాజకులములు అనగా రాజవంశమందు పుట్టినవారు, మిథః = ఒకరొకరు, సంఘర్షితాః = కలహించినవారై, దహ్యంతే = ధ్వంసమగుచున్నారు.

అర్థాంతరము. ఏకక్షితి భృదుత్పన్నాః - ఏక=ఒకటైన, క్షితభృత్=కొండయందు, ఉత్పన్నాః = పుట్టినట్టియు, సచ్ఛిద్రాః = రంధ్రములతోగూడినట్టియు, కంటకోల్బణాః = ముండ్లచే వ్యాప్తములైనట్టియు, సానుగామినః - సాను=కొండయొక్క సమభూములను, గామినః = పొందినట్టి, అనగా నచ్చటనుండునట్టి, వంశాః= వెదుళ్లు, మిథః=ఒకటికొకటి, సంఘర్షితాః=రాపిడిగలవియై, దహ్యంతే=కాలిపోవుచున్నవి.

తా. ఒక కొండయందుత్పన్నములై లోపల రంధ్రములుగలిగి వెలి ముండ్లచే వ్యాప్తములై సానువులందుండు వెదుళ్ళొకటి కొకటి యొరసికొనుటచేత గలిగిన యగ్నివలన నెవ్విధమున కాలిపోవుచున్నవో, అట్లే యొకరాజువలననే గలిగి వేట ద్యూతము మొదలగు దోషములుగలవారై మిక్కిలి శత్రువులుగలవారై భృత్యులతో గూడి

యుండు రాజపుత్త్రులు పరస్పరము కలహించినవారై నాశమును బొందుదురు. వెదుళ్లు రాచుకొనుటచే నగ్నిగలుగుట ప్రసిద్ధము. ౨౫.

శ్లో. మహాగోత్రేషు సంజాతా మృదవో యేపి తేజనాః,
స్వజీవితవ్యయేనాపి బహుధాన్యోపకారిణః ౨౬.

టీ. యే = జనాః = ఏమనుష్యులు, మహాగోత్రేషు = గొప్పకులములందు, సంజాతాః = పుట్టినవారుగనుకనే, మృదవః = దయగలవారో, తే = వారు, స్వజీవితవ్యయేనాపి - స్వ = తమయొక్క, జీవిత = జీవనమైనధనాదులయొక్క, వ్యయేనాపి = నాశముచేతనైనను, బహుధా = నానావిధములచేత, అన్యోపకారిణః - అన్య = ఇతరులకు, ఉపకారిణః = ఉపకారముచేయువారు, భవంతి = అగుచున్నారు.

అర్థాంతరము. మహాగోత్రేషు = గొప్పవియైన వింధ్యము మొదలగుకొండలందు, సంజాతాః = పుట్టినట్టి, మృదవః = లోపలబోలగుటచే మెత్తగనుండు, యే = ఏ, తేజనాః = వెదుళ్లుగలవో, తే = ఆవెదుళ్లు, స్వజీవితవ్యయేనాపి - స్వ = తమయొక్క జీవిత = బ్రతుకుయొక్క, వ్యయేనాపి = నాశముచేతనైనను, బహుధా = అనేకప్రకారములైన ఇల్లు మొదలగు రూపముచేత, అన్యోపకారిణః - అన్య = ఇతరులకు, ఉపకారిణః = సహాయముచేయునవి, భవంతి = అగుచున్నవి, (అథవా, బహు = అధికమైన, ధాన్య = బియ్యమొసంగుటచేత, ఉపకారిణః = ఉపకారముచేయునవి, భవంతి = అగుచున్నవి).

తా. గొప్పవైన వింధ్యాదిపర్వతములందు సంభవించి మెత్తని స్వభావము గలిగి తమకు మూలభేదముగలిగినను పరులకు ఇండ్లు మొదలగునవికట్టుకొనుటకుగాని, అథవా తమధాన్యమనగా వెదురు బియ్యముచేతగాని యెట్లుపకారముచేయుచున్నవో అట్లు గొప్పకులమందుజనించినవారు దయావంతులై తమబ్రతుకునకు హానిగలిగినను దాని గమనించక నన్యులకుపకార మనేకవిధములుగా నొనర్చుచున్నారు. వెదుళ్ళు పండగా నెండిపోవుట ప్రసిద్ధము. అప్పుడు బియ్యము దొరకును. ౨౬.

శ్లో. పరమస్యైవ పుంసస్స్యాన్నిత్యం శ్రీరనపాయినీ,
సారం సదాశయేనేహ సాధుచక్రం బిభర్తి యః. ౨౭.

టీ. యః = ఏపురుషుడు, ఇహ = ఈలోకమందు, సదాశయేన = మంచియభిప్రాయముచేత, నిర్మలమనస్సుచేననుట, సారం = శ్రేష్ఠమైన, అథవా న్యాయ్యమైన, సాధుచక్రం = సత్పురుషసమూహమును, బిభర్తి = పాలించుచున్నవాడో, అస్య =

ఇట్టిశ్రేష్ఠుడైనట్టి, పుంసఏవ = పురుషునకే, శ్రీః = సంపత్తు, పరం = మిక్కిలి, అనపాయినీ = ఎడబాయకుండునది, స్యాత్ = అగును.

అర్థాంతరము. యః = ఏవిష్ణువు, సదా = ఎల్లపుడు, సారం = శ్రేష్ఠమైనట్టి, చక్రం = చుట్టుకైదువను, శయేన = హస్తముచేత, సాధు = చక్కగా బిభర్తి = ధరించుచున్నాడో, తస్య = అట్టి, పరమస్యైవ = శ్రేష్ఠుడైనట్టి, పుంసః = పురుషునియొక్క, శ్రీః = లక్ష్మీదేవి, నిత్యం = ఎల్లపుడు, అనపాయినీ = ఎడబాయకుండునదిగా, స్యాత్ = అగును.

తా. ఏపురుషుడు మంచియభిప్రాయముచేత సాధువులను సంరక్షించుచున్నవాడో అట్టివానియొక్క సంపత్తే యెల్లప్పుడు బాయకుండుననియు, శ్రేష్ఠమైనచక్రమును హస్తమందుధరించుచుండు పరమాత్ముడైన శ్రీమహావిష్ణువునకెప్పుడు లక్ష్మీదేవి సన్నిహితమైయుండుననియు భావము. ౭౭.

శ్లో. మృదవోఽపిసదామోద హేతవోఽప్యమలాఅపి,
నాతిశ్లాఘ్యాస్సుమనసో జనైర్జాతివివర్జితాః. ౭౮.

టీ. మృదవోఽపి = కరుణాశీలులైనను, సదామోదహేతవోఽపి - సత్ = సత్పురుషులయొక్క, ఆమోద = సంతోషమునకు, హేతవోఽపి = కారణములైనను, అమలాఅపి = నిర్మలమైన మనస్సుగలవారైనను, జాతివివర్జితాః = కులీనులుకానియట్టి, సుమనసః = విద్వాంసులు, జనైః = సత్పురుషులచేత, అతిశ్లాఘ్యాః = మిక్కిలిస్తుతింపదగినవారు, న = కారు.

అర్థాంతరము. మృదవోఽపి = కోమలములైనను, సదా = ఎల్లపుడు, ఆమోదస్య = పరిమళమునకు, హేతవోఽపి = కారణములైనను, అమలాఅపి = దోషరహితములైనను, జాతివివర్జితాః = జాజులకంటెవేరైన, సుమనసః = పువ్వులు, అతిశ్లాఘ్యాః = మిక్కిలిపొగడదగినవి, న = కావు.

తా. మృదువుగలిగి మంచివాసనచేనలరి స్వచ్ఛములైయుండినను జాజులుకాని పువ్వులెట్లు విశేషశ్లాఘ్యములుకావో యత్తెఱంగుననె దయావంతులై సజ్జనసంతోషకరులై స్వచ్ఛచిత్తులైయుండినను సత్కులమందు పుట్టనివారు హెచ్చుగా పొగడదగినవారుకారు, అనగా సామాన్యముగా పొగడదగుననియు అన్నిగుణములు కలిగియున్నను కులములేనివారు ప్రకాశించరనియుభావము. ౭౮.

శ్లో. కుజన్మనాయత్క్రూరేణ పారుష్యంరజసాకృతం,
లబ్ధవర్ణస్యనగ్లాని స్సచిత్రస్యేవతావతా. ౭౯.

టీ. కుజన్మనా = చెడ్డజన్మముగల, అనగాకులహీనుడైన, క్రూరేణ = క్రూరుడైన పురుషునిచేత, రజసా = రజోగుణముచేత, అనగా నహంకారముచేత, యత్ = ఏ, పారుష్యం = బెదరింపుమొదలైనది, అకారి = (గురువుమొదలగు వారియందు) చేయబడుచున్నదో, తావతా = అంతమాత్రముచేత, లబ్ధవర్ణస్య = విద్వాంసునకు = కుజన్మనా - కు = భూమివలన, జన్మనా = పుట్టినట్టి, క్రూరేణ = కఠినమైన, రజసా = దుమ్ముచేత, యత్ = ఏ, పారుష్యం=పరుసదనము, అనగామలినత్వము, కృతం= చేయబడుచున్నదో, తావతా = అంతమాత్రముచే, లబ్ధవర్ణస్య — లబ్ధ = పొందబడిన, వర్ణస్య = నలుపు పసుపు మొదలగు వన్నెలుగల, చిత్రస్యేవ = చిత్రమునకువలెనే, గ్లానిః = మాలిన్యము, నభవతి = కలుగదు.

తా. భూమివలనజనించి పరుసమైనధూళిచేత చక్కగా వన్నెపూయబడినచిత్రములకు నెవ్విధమునహానికలుగదో యవ్విధమున జాతిహీనులై క్రూరులైనవారు గర్వముచేత పెద్దలనుదూషించిరేని యంతమాత్రముచేత పెద్దలకేలాటి మాలిన్యము కలుగనేరదు. చిత్రములు నీరుమొదలగువానిచే చెడినట్లు భూపరాగముచేత చెడదనియు దుర్జనుల తిరస్కారములు సజ్జనులకు జెరుపజాలదనియుభావము. ౭౯.

శ్లో. పార్శ్వేవసంతంకామేషు సాధకంసహకారిణం,
దృష్ట్వా పికఃపుమాన్ హృష్య న్నాలపేన్మధురాంగిరం. ౮౦.

టీ. పార్శ్వే = చెంగట, వసంతం = ఉండునట్టియు, కామేషు = ఇష్టార్థములందు, సాధకం = సంపాదకుడైనట్టి, సహకారిణం = సహాయకుడైనపురుషుని, దృష్ట్వా=చూచి, కఃపుమాన్=ఏపురుషుడు, హృష్యన్ = సంతసించినవాడై, మధురాం = మనోహరమైన, గిరం = మాటను, నాలపేత్ = పలుకడా! అనగాపలుకుచున్నాడనుట. గుణవంతులను పూజింతురనిభావము.

అర్థాంతరము. సహకారిణం = తియ్యమామిడిపువ్వుగలదిగనుకనే, కామేషుసాధకం - కామ = మన్మథునియొక్క, ఇషు=తూపులకు, సాధకం = సంపాదకమైనట్టి, వసంతం=ఆమినిని, పార్శ్వే=ప్రక్కయందు, దృష్ట్వా=చూచి, (అనగా వసంతకాలధర్మమును గాంచియనియర్థము. కాలమునకు మూర్తములేదుకద) పుమాన్=పురుషరూపమైన, పికః=కోయిల, హృష్యన్=సంతసించినదియై, మధురాం=ఇంపైన, గిరం= పలుకును, నాలపేత్=పలుకదా?

తా. తనపరంగటమెలంగుచు నిష్టార్థంబులను సంపాదింపజేయుచునెప్పుడు నెడబాయకయుండు చెలికానిఁగాంచి యెవ్వాఁడైనను తియ్యనిపలుకులు పలుకకుండు నాయనియర్థము. తియ్యనిమామిడిపూలచేనొప్పుచు పచ్చవిల్కానితూపులకుసాధకంబైన యామినిఁ సమీపంబునఁగాంచి గండుకోయిల మధురముగా రోదనసేయకుండు నాయని భావము. ౭౦.

శ్లో. దేవాశ్చభూమిదేవాశ్చ నిత్యమప్యమృతాశనాః,
హీయంతేస్వాధికారాత్తే యేసేవంతేనవాసవం. ౭౧.

టీ. నిత్యం = ఎల్లపుడు, అమృతాశనాః - అమృత = పాలు, అశనాః = అన్నముగాఁగల, యేదేవాః = ఏదేవతలు, వాసవం = ఇంద్రునిఁ, నసేవంతే = కొలువరో, తే = ఆదేవతలు, స్వాధికారాత్ - స్వ=తమయొక్క, అధికారాత్ = స్వామిత్వము వలననుండి, హీయంతే = విడువబడుచున్నారు.

అర్థాంతరము. యేభూమిదేవాః = ఏబ్రాహ్మణులు, నిత్యం = ఎల్లపుడు, అమృతాశనా అపి-అమృత=యజ్ఞశేషము, అథవా=అయాచిత పదార్థము, లేక జలము, అశనా అపి = అన్నముగాఁగలవారైనను, శ్లో. అమృతం యజ్ఞశేషంబు సుధాపోఽక్షే స్వయాచితే,అన్నకాంచనయోర్జగ్ధౌ ఖేస్వాదునిరసాయనే,ఘృతేహ్యాద్యేగోరసేచ. అని హేమచంద్రుడు. నవాసవం - నవ = క్రొత్తయైన, ఆసవం=కల్లును, సేవంతే = త్రాగుచున్నారో, తే =ఆబ్రాహ్మణులు, స్వాధికారాత్-స్వ=తమయొక్క. అధికారాత్ =కర్మవలననుండి, హీయంతే=తక్కువగుచున్నారు.

తా. అమృతమే యన్నముగాఁగల దేవతలు తమకు నేలికయైన యింద్రునిఁ సేవించకయుండిరేని వారివారి యధికారమువలననుండి బహిష్కృతులగుదురు. యజ్ఞశేషముగాని అయాచితమైనదికాని నీరుకాని యన్నముగాఁగల బ్రాహ్మణులు కల్లు త్రాగుదురేని కర్మభ్రష్టులగుదురు. ౭౧.

శ్లో. అశేషచక్షుశ్రవణ ప్రతికూలోభవన్నపి,
వినతానందహేతుర్య స్సపుమానాప్తనందకః ౭౨.

టీ. యః = ఏపురుషుడు, అశేషచక్షుశ్రవణప్రతికూలః - అశేష= అందఱియొక్క. చక్షుఃశ్రవణ = నేత్రములకువీనులకు, ప్రతికూలః = శత్రువు, భవన్నపి = అయినను, అనగా దౌర్జన్యముచేత చూడక వినకపోయినను, వినతానందహేతుః- వినత =నమ్రులైనవారియొక్క, ఆనంద = సంతోషమునకు, హేతుః = కారణమయ్యెనేని,

సః=ఆ, పుమాన్ = పురుషుడు, ఆప్తనందకః - ఆప్త = సత్పురుషులను, నందకః = సంతసింపజేయువాడగును.

అర్థాంతరము. యః=ఏగరుడుడు, అశేషచక్షుశ్శ్రవణ ప్రతికూలః - అశేష= సమస్తమైన, శేష సర్పవ్యతిరిక్తులైన, చక్షుశ్శ్రవణ = సర్పములకు, ప్రతికూలః = విరోధి, భవన్నపి = అయినను, వినతానందహేతుః - వినతా = వినతయనెడి తనతల్లి యొక్క, ఆనంద=సంతోషమునకు, హేతుః=కారణమాయెనో, సః=అట్టి, పుమాన్ =పురుషుడైన గరుడుడు, ఆప్తనందకః - ఆప్త = సాధువైన, నందకః=కులపాలకుడు అగుచున్నాడు. శ్లో. నందకః కులపాలకే, హర్షకేవిష్ణుఖడ్గేచ. అని హేమచంద్రుడు.

తా. సమస్తజనులను చూడకయు వారిమాటవినకయు నుండినను ఏపురుషుడు సత్పురుషులకు సంతోషకరుడగుచున్నాడో వానికి సజ్జనుడనియే భావింపదగును, అనగా దోషముగలవాడైనను కొన్నిగుణములుండెనేని యాగుణములు దోషములను గప్పుచున్నవని భావము. గరుడుడు సకలసర్పములకువిరోధియైనను ఆదిశేషునితో కలహమొనర్పక తనతల్లియైనవినతకు మిక్కిలిసంతోషమాచరించి తనకులముసుద్ధరించినవాడగుటచే ఆప్తనం దకుడని ప్రసిద్ధిబొందెను. ౯౨.

శ్లో. హతకామంచిరంలోకం ప్రభోరుగ్రస్యవీక్షణాత్,
కుర్యాద్యోనిజయాలక్ష్మ్యా సకామంపరమఃపుమాన్ ౯౩.

టీ. యః=ఏపురుషుడు, ఉగ్రస్య=కోపముగల, ప్రభోః=రాజుయొక్క, వీక్షణాత్=క్రూరదృష్టివలన, చిరం=చాలకాలముదాక, హతకామం - హత = నష్టమైన, కామం=ఇష్టార్థముగల, లోకం=జనమును, నిజయా=తనసంబంధమైన, లక్ష్మ్యా = సంపత్తు చేత, సకామం=ఇష్టార్థములతోగూడినవానిగా, కుర్యాత్=చేయుచున్నాడో, సః= వాడు, పరమః=శ్రేష్ఠుడైన, పుమాన్=విష్ణుసదృశుడేయగును.

అర్థాంతరము. ప్రభోః=స్వామియైన, ఉగ్రస్య=పరమేశ్వరునియొక్క, వీక్షణాత్=ఫాలనేత్రదృష్టి వలన, చిరం=పెద్దకాలము, హతకామం-హత=దగ్ధింపబడిన, కామం=మన్మథుడుగల, లోకం=జగత్తును, యః=ఏయీశ్వరుడు, సకామం=మన్మథ సహితముగా, కుర్యాత్=చేయుచున్నాడో, సః=ఆశివుడు, పరమః = శ్రేష్ఠుడైన, పుమాన్=పురుషుడు అగుచున్నాడు.

తా. రాజుకోపమునకు పాత్రుడై నష్టసంపదగలపురుషునికి దనసంపదచే సంతోషింపజేసినపురుషుడు పురుషశ్రేష్ఠుడనియర్థము. ద్రోహమొనర్చుటచే ఫాలనేత్రదగ్ధుడైనమన్మథుని రతీదేవిప్రార్థనచే మరలజీవింపజేసిన పరమేశ్వరుడే శ్రేష్ఠుడు. ౯౩.

శ్లో. జడేన రాజ్ఞా లబ్ధోస్తు సలోక నిజ మండలః,
విరోధ్యాక్రమ్య గృహ్ణీయా త్తం తథాపి మహా త్తమః. ౮౪.

టీ. జడేన=తెలివిలేని, రాజ్ఞా=ఏలిక చేత, సకలః=సమస్తమైన, నిజమండలః=స్వదేశము, లబ్ధః=పొందబడినది, అస్తు=అవుగాక; తథాపి=అట్లైనను, మహత్తమః=మిక్కిలిగొప్పవాడైన, విరోధీ=శత్రువు, తం=ఆదేశమును, ఆక్రమ్య=వశపఱచుకొని, గృహ్ణీయాత్=అపహరించును.

అర్థాంతరము. జడేన=చల్లనైన, రాజ్ఞా=చందురునిచే, సకలః = కలతోఁగూడినట్టి, నిజమండలః=తనదైనబింబము, లబ్ధః=పొందబడినది, అస్తు=అవుగాక; తథాపి = అట్లైనను విరోధీ=శత్రువైన, మహత్=బలాధికుడైన, తమః=రాహువు, తం=ఆచందురుని, ఆక్రమ్య=ఆక్రమించి, గృహ్ణీయాత్=పట్టుకొనును.

తా. బాలిశుండగురాజొకవేళ ప్రభుత్వమును పొందినను తనకంటె నెక్కువబలముగలవిరోధియైన యొకడు ఆదేశమును బలిమిచేనాక్రమించి తీసికొనును. చల్లనైన చంద్రుడు కలలచే పూర్ణమైనతనబింబమును పున్నమనాడుపొందినను, రాహుగ్రహము విరోధముచేత నాక్రమించి యాచంద్రునిబట్టుకొనును. ౮౪.

శ్లో. దృష్ట్వాగ్రేభూభృతఃకన్యాం శమస్థోపివికారవాన్,
అతనుంకామమాతన్వ న్నష్టాత్మేత్యుచ్యతేబుధైః. ౮౫.

టీ. అగ్రే=ముంగల, భూభృతః=రాజుయొక్క, కన్యాం=పడుచును, దృష్ట్వా=చూచి, శమస్థోఽపి=కామాదులు లేనివాడైనను, కామం=అభిలాషను, అతనుం = ఎక్కువగా, ఆతన్వన్=చేయువాడై, వికారవాన్=మోహముగలవాడు, నష్టాత్మా-నష్ట=నాశమైన, ఆత్మా=బుద్ధిగలవాడని, బుధైః=విద్వాంసులచేత, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

అర్థాంతరము. అగ్రే=ఎదుట, భూభృతః=మంచుకొండయొక్క, కన్యాం=కూతురైన ఉమాదేవిని, దృష్ట్వా=చూచి, శమస్థోఽపి=కామాదిరహితుడైతపంబొనర్చువాడైనను, కామం=మన్మథుని, అతనుం=శరీరములేనివానిగా, ఆతన్వన్=చేసినవాడై, వికారవాన్=మనోవికారముగల ఈశ్వరుడు, బుధైః=పండితులచేత, లేక=దేవతలచేత, అష్టాత్మా—అష్ట=ఎనిమిదివిధములైన, ఆత్మా=శరీరములుగలవాడు, ఇతి=ఇట్లని. ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఇంద్రియములను నిగ్రహించి కామక్రోధాదులను మానినవాడైనను తన ముంగల రాజకుమారికఁ గాంచి కామమోహితుడై వికారము గలవాడయ్యెనేని యట్టివానిఁ విద్వాంసులు బుద్ధిలేనివానిగా దెలియుచున్నారు.

దక్షిణామూర్తియై హిమవత్పర్వతమున యోగనిష్ఠ చేనుండి తనకపకారమొనర్చిన మన్మథునిఁ ఫాలనేత్రాగ్నిచే దహించి పిదప రతీదేవి ప్రార్థనచే నామదనునకు శరీరము లేకయే ప్రాణంబొసంగి తనముంగల మెలంగు హిమవత్పర్వత కుమారికయైన పార్వతిఁ గాంచి వికారమును బొందినవాడైన శివునిఁ దేవతలును వ్యాసాది విద్వాంసులును అష్టమూర్తియని చెప్పుచున్నారు. అనగా, శ్లో. భూతార్కచంద్రయజ్వానో మూర్తయో ష్టౌ ప్రకీర్తితాః. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, చంద్రుడు, సూర్యుడు. యజ్ఞము చేయువాడు. ౧౫.

శ్లో. తం ప్రభుం ప్రాప్య విశ్వస్య రతిః కథమివోల్లసేత్,
క్రోధజ్వలితయా దృష్ట్వా యేన కామో నిహన్యతే. ౧౬.

టీ. యేన = ఏ రాజు మొదలగు జనము చేత, క్రోధజ్వలితయా-క్రోధ=కోపము చేత. జ్వలితయా=ఉగ్రమైనట్టి, దృష్ట్వా = చూపుచేత, కామః = ఇష్టార్థము, నిహన్యతే = వ్యర్థముగా చేయబడుచున్నదో, విశ్వస్య=లోకమునకు, ప్రభుం = నాయకుడైన, తం = ఆ రాజు మొదలగు జనమును, ప్రాప్య = పొంది, రతిః = యాచకుల సంతోషము, కథమివ= ఏరీతిగ, ఉల్లసేత్ = ప్రకాశించును. అనగా ప్రకాశించదనుట.

అర్థాంతరము, యేన=ఎవనిచేత, క్రోధజ్వలితయా - క్రోధ=తపంబు చెడుటచే గలిగిన రోషముచేత, జ్వలితయా = మండుచునుండు, దృష్ట్వా = ఫాలనేత్రావలోకనము చేత, కామః = మన్మథుడు, నిహన్యతే= దహింపబడుచున్నాడో, విశ్వస్య = ప్రపంచమునకు, ప్రభుం = స్వామియైన, తం=ఆ పరమేశ్వరునిఁ, ప్రాప్య= పొంది, రతిః = రతీదేవి, కథమివ=ఏవిధమున, ఉల్లసేత్ =సంతసించును. అనగా లేదనుట.

తా. తపోవిఘ్నంబువలన గలిగిన రోషముచేత మన్మథుని ఫాలనేత్రాగ్నిచే గాల్చిన పరమేశ్వరుని వేడుకొను రతీదేవికి నెవ్విధమున సంతోషము లేదో అవ్విధముననే కోపదృష్టిచేత యాచకుల ఇష్టార్థములను చెఱిపిన రాజు మొదలగువారిని పొందిన యాచకుల కోరికలు ఫలించవనియర్థము. రతీదేవి పరమేశ్వరుని ప్రార్థింపగా నామె కోరికె రీతిగా మన్మథుడు అశరీరుడు కాకపోయెననియు, లోభులగు ప్రభువు చెంగట యాచకుల ప్రార్థనలు చెల్లవనియు భావము. ౧౭.

శ్లో. జనిత్వాపిమహావంశే వక్రాః కేచనకంటకాః,
కుర్యుర్జనపదక్లేశం స్సాధుమార్గస్యదూషకాః. ౮౭.

టీ. వక్రాః = కుటిలబుద్ధిగల, కేచన= కొందఱు, కంటకాః = క్షుద్రశత్రువులు. "శ్లో. కంటకఃక్షుద్రవైరిణే, వేణౌద్రుమాంగేరోమాంచే". అని హేమచంద్రకోశము. మహావంశే=గొప్పకులమందు, జనిత్వాపి=పుట్టియుండినను, సాధుమార్గస్య-సాధు=సత్పురుషులయొక్క, మార్గస్య=మంచియాచారమునకు, దూషకాః = దోషముగలుగజేయువారై, జనపదక్లేశం-జనపద=రాష్ట్రమునకు, క్లేశం =దుఃఖమును, కుర్యుః =చేయుదురు.

అర్థాంతరము. మహావంశే=గొప్పవెదురునందు, జనిత్వాపి=పుట్టినను, వక్రాః=వంకరలైన, కేచన=కొన్ని, కంటకాః=ముండ్లు, సాధుమార్గస్య - సాధు=చక్కనైన, మార్గస్య=త్రోవకు, దూషకాః = చెట్టకలుగజేయునివియై, జనపదక్లేశం - జన=మనుష్యులయొక్క, పద=పాదములకు, క్లేశం=కష్టమును, కుర్యుః=చేయుచున్నవి.

తా. ప్రఖ్యాతమైన వంశమునందు జనించినవారైనను కొందఱు నీచులగువారు సదాచారములను వ్యభిచారాదిదోషములచే చెఱుపుచు ధర్మహానియగుటచే సంభవించెడి యవగ్రహాది దోషములవలన దేశమును నాశముచేయుచున్నారనియు, లేక దొంగతనముచేయుటవలన రాజ్యమునకు తొందరచేయుదురనియును అర్థము. గొప్పదైన వెదురునందుపుట్టిన వక్రములైన ముండ్లు మంచిమార్గమందుపడుటచే నాత్రోవను దూషితముగాజేసి నడుచు జనులపాదములందు గ్రుచ్చుకొని కష్టముకలుగజేయుననియునర్థము.

శ్లో. క్షుద్రాన్హిత్వాసవయసో ప్యప్రసన్నాన్జడాశయాన్,
విప్రఃస్థితోహంసఇవ ప్రాప్నుయాన్మానసంసుఖం. ౮౮.

టీ. జడాశయాన్ - జడ=మందమైన, ఆశయాన్=బుద్ధిగల, అప్రసన్నాన్=కలుషచిత్తులైన, సవయసః=సమానమైనవయస్సుగల, క్షుద్రాన్=నీచులను, హిత్వా=విడిచి, స్థితః=ఉండెడి, విప్రః=బ్రాహ్మణుడు; సవయసః=కాకిమొదలగుపక్షులతో కూడియుండిన, అప్రసన్నాన్=తేటలేనట్టియు, క్షుద్రాన్ = అల్పములైన, జడాశయాన్ =సరస్సులను, హిత్వా=విడిచి, విస్థితః = వెడలినట్టి, హంసః = హంసము, మానసం = మానససరోవరసంబంధమైన, సుఖమివ=సంతోషమునువలెనే, మానసం = మనస్సునందుబుట్టిన, సుఖం = సంతోషమును, ప్రాప్నుయాత్ = పొందుచున్నాడు

తా. కమలములేకుండుటచే కాకి మొదలగు క్షుద్రపక్షులుగలిగి గంభీరము లేమిచే తేటలేకయుండు అల్పసరస్సులను పరిత్యజించి హంసపక్షి యెవ్విధమున మానస సరోవరసౌఖ్యమును బొందుచున్నదో అవ్విధమున బ్రాహ్మణుడు మందమతులు క్రూర చిత్తులునైన సమానవయస్కులైన నీచులనువిడిచి ఉదారహితమైన మన స్సౌఖ్యమును బొందుచున్నాడు. జడాశయ అనుచో లడలకభేదముగాన జలాశయమని యగు చున్నది. వర్షాకాలములందే క్షుద్రసరస్సులందు జలంబుండుట ప్రసిద్ధము. ఆకాలమున హంసలకు రోగముగలుగుటచే మానససరోవరమునుగూర్చి పారిపోవు చున్నవని భావము.

శ్లో. యశోదయాశీలరూపమాధుర్యైరపిసర్వతః,
సబాలోఽపిపుమాన్వృద్ధః సాధుబృందావనేరతః. ౮౯.

టీ. యశోదయాశీలరూపమాధుర్యైరపి - యశః = కీర్తియు, దయా=కరు ణయు, శీల=సదాచారము, రూప=సౌందర్యము, మాధుర్యైః=మధురత్వము, అనగా తియ్యగ మాటలాడుటయును. వీనితోడ, సమంతతః = అంతటను (ఉపలక్షితః = కూడినట్టియు) సాధుబృందావనే - సాధు=సత్పురుషులయొక్క, బృంద = సమూహ ముయొక్క, అవనే = రక్షణమందు, రతః=ఆసక్తికలిగినట్టి, సః = ఆ, పుమాన్ = పురుషుడు, బాలోపి=చిన్నవాడైనను, వృద్ధః=ముసలివాడు, అగుచున్నాడు.

అర్థాంతరము. యశోదయా = తల్లియైనయశోదాదేవితోడ నుండునట్టియు, శీలరూపమాధుర్యైరపి = సదాచార సౌందర్యహితభాషిత్వములచేత, సర్వతః=అంత టను, ప్రసిద్ధుడైనట్టియు, బృందావనే = గోకులబృందావనమనుస్థలమందు, సాధు = చక్కగా, రతః=ఆసక్తిగలవాడును, అథవా,సత్పురుషసమూహ సంరక్షణమందాసక్తి గలయట్టి, సఃపుమాన్ = ఆశ్రీకృష్ణమూర్తి, బాలోపి = చిన్నవాడైనను, వృద్ధః = ముసలివానివలెపూజ్యుడు, అగుచున్నాడు.

తా. బాలుడగుటన్ యశోదాదేవితోడ నుండువాడై దయాశీలమాధుర్యాది గుణయుక్తుండై బృందావనమందు క్రీడించుచు సత్పురుషులను రక్షించు శ్రీకృష్ణమూర్తి యేలాగున బాలుడైనను వృద్ధునివలె పూజ్యుడగుచున్నాడో ఆలాగుననే ఏవాడైనను కీర్తియు, కరుణయు, రూపము, మంచిమాటలాడుటయు గలిగి సజ్జనులను గాపాడుట యందాసక్తియుగలవాడో ఆతడు వయస్సుచే చిన్నవాడైనను గుణములచే పెద్దవాడ గుటంబట్టి వృద్ధునివలె పూజింపదగినవాడు. బాలత్వ, వృద్ధత్వములకు వయస్సు

కారణము కాదు. "న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిరః, యో వై యువాప్యధీయాన స్తం దేవాః స్థవిరం విదుః" అనుమనువచనమువలన పండితుడగువాడే వృద్ధుడని భావము. యశస్సు, దయ, మంచియాచారము, హితకర్తృత్వము లే పాండిత్యలక్షణము. "యత్రాకృతి స్తత్ర గుణాః" అని యుండుటచే సౌందర్యము గలవాడు సద్గుణములు గలవాడుగానే యుండును. ౫౯.

శ్లో. ద్విపాశ్చ దురమాత్యాశ్చ ప్రవృద్ధా యత్ర భూభృతి,
తస్యైవ శృంగభంగాయ మదాత్పరిణమంతి హి. ౬౦.

టీ. ద్విపాః = ఏనుగలు, యత్ర = ఏ, భూభృతి = పర్వతమునందు, ప్రవృద్ధాః = పెంపువడసినవియో, మదాత్ = మదముగలుగుటవలన, తస్యైవ = ఆ పర్వతముయొక్కయే, శృంగభంగాయ-శృంగ = శిఖరముయొక్క, భంగాయ = నాశముకొఱకు, పరిణమంతి హి = సమర్థములగుచున్నవి.

అర్థాంతరము. దురమాత్యాశ్చ = దుష్టులైనమంత్రులు, యత్ర భూభృతి = ఏ రాజునందు, ప్రవృద్ధాః = వృద్ధినిబొందెదరో, మదాత్ = గర్వమువలన, తస్యైవ = ఆరాజుయొక్కయే, శృంగభంగాయ-శృంగ = ప్రభుత్వముయొక్క, "శృంగం చిహ్నవిషాణయోః, క్రీడాంబుయంత్రే శిఖరే ప్రభుత్వోత్కర్ష సానుషు." అని హేమచంద్రకోశము. భంగాయ = నాశనముకొఱకు, పరిణమంతి హి = సమర్థులగుచున్నారు.

తా. తాము పెంపుచెందిన కొండయొక్క శిఖరముల నుత్పాతక్రీడచే పొర్లించి నాశమొనర్చు మదపు టేనుగలక్ బోలి దుష్టులగు మంత్రులు తామేరాజువలన వృద్ధినొందిరో అట్టి యేలికయొక్క ప్రభుత్వనాశనమునకు గర్వముచే నాయత్తపడుదురు. రాజగువాడు మంచిమంత్రినుంచికొనవలయును కాని దుష్టునియుంచరాదని భావము. శ్లో. నిరుంధానః సతాంమార్గం భక్షయంతి మహీపతిం, దుష్టాత్మానస్తు సచివా స్తస్మాత్సుసచివో భవేత్." అని కామందకము. ౬౦.

శ్లో. వృతాస్సుహృద్భిర్యైస్సర్వైర్ద్విజిహ్వై ర్జిహ్మచారిభిః,
దుష్ప్రాభృతోనసేవ్యాస్తే జనై ర్జీవనకాంక్షిభిః. ౬౧.

టీ. ద్విజిహ్వైః = సత్యాసత్యరూపములగు రెండు నాలుకలుగల, అనగా కొండెముపలికెడివారు గనుకనే, జిహ్మచారిభిః- జిహ్మ = తప్పుకలుగునట్టుగా, చారిభిః = ప్రవర్తించుస్వభావముగల, యైః = అట్టి, సర్వైః = సమస్తమైన, సుహృద్భిః =

బంధువులైనపురుషులచే, యే = ఏరాజులు, వృతాః = పరివేష్టింపబడియున్నవారో, తే=అట్టి, దుర్భూభృతః = దుష్టరాజులు, జీవనకాంక్షిభిః = బ్రతుకునపేక్షించెడి, జనైః = మనుష్యులచేత, నసేవ్యాః = ఆశ్రయింపదగినవారు కారు.

అర్థాంతరము. జిహ్మచారిభిః - జిహ్మ = వంకరగా, చారిభిః=తిరుగుచుండెడి, తైః = అట్టి, ద్విజిహ్వైః = పాములచేత, యే= ఏపర్వతములు, వృతాః= ఆవరింపబడియున్నవో, తే=అట్టి, దుర్భూభృతః = చెడ్డపర్వతములు, జీవనకాంక్షిభిః-జీవన =జీవనహేతువైన ఫలములు మొదలగువానిని, కాంక్షిభిః = కోరుచుండెడి, జనైః = మనుష్యులచేత, నసేవ్యాః = పొందదగినవి కావు.

తా. సొట్టగా నడుచుచుండు సర్పములచే వ్యాప్తములైన కొండ లేవిధమున పరిహరింపదగినవో అవ్విధమున కొండెము చెప్పుచు దుష్టాచారవంతులైన బంధువులతో కూడినవారలగుటచే దుష్టులైన రాజులు జీవనము కోరువారిచే సేవింపఁదగరు ; దుష్టజన పరివృతుడగుటచే దుష్టుడైనరాజును యాచకులు సేవించరాదనిభావము. ౯౧.

శ్లో. పితృపత్యభిగుప్తాపి యాలంకాపథసంగినీ,
సర్వదైవక్రియానర్హా సా స్త్రీదిగివదక్షిణా. ౯౨.

టీ. యా=ఎవతె, పితృపత్యభిగుప్తాపి - పితృ = తండ్రిచేతను, పతి=మగనిచేతను, అభిగుప్తాపి=రక్షింపబడినదైనను, అలం=పూర్తిగా, కాపథసంగినీ - కాపథ = వ్యభిచారాది దురాచారముయొక్క, సంగినీ=సంబంధముగలది యగుచున్నదో, సా= అట్టి, స్త్రీ = ఆడుది, పితృపత్యభిగుప్తాపి= పితృపతి=యమునిచే, అభిగుప్తాపి రక్షింపబడినదియైన, లంకాపథసంగినీ - లంకా=లంకాపట్నముయొక్క, పథ=మార్గముయొక్క, సంబంధముగల, లేక, అలం = పూర్ణముగా, కాపథ = వైతరిణీనది మొదలగు కుత్సితమార్గముయొక్క, సంగినీ=సంబంధముగలిగి, సర్వదైవక్రియానర్హా-సర్వ = సమస్తములైన, దైవక్రియా=దేవకార్యములైనయజ్ఞాదులందు, అనర్హా = యోగ్యముకానియట్టి, దక్షిణాదిగివ= దక్షిణదిక్కువలెనే, సర్వదా=ఎల్లప్పుడును, క్రియా=ధర్మకార్యములందు అనర్హైవ = యోగ్యురాలు కానే కాదు.

తా. ధర్మరాజుచే పాలితంబై లంకామార్గమునుబొంది సమస్త దేవకార్యముల కనర్హమైన దక్షిణదిక్కువలెనే, తండ్రిచేతను మగనిచేతను బోషింపబడుచుండినను దురాచారమునుబొందిన స్త్రీ గృహకృత్యములకుగాని యజ్ఞాది దేవకార్యములకుగాని యోగురాలు కాదు.

దేవకార్యములు దక్షిణాభిముఖముగా చేయరాదనుట ధర్మశాస్త్ర ప్రసిద్ధము. ఇచట అలంకాపథసంగినీ అనుటచే సామాన్యముగా దోషమాచరించిన స్త్రీని ప్రాయశ్చిత్తముచే గ్రహించవలయుననియు పరపురుషునివలన గర్భముధరించిన స్త్రీని విడువవలయుననియు నుండుటవలన మిక్కిలిదోషియైన స్త్రీవిషయమందు, శ్లో. హృతాధికారాంమలినాంపిండమాత్రోపజీవినీం, పరిభూతామథశ్శయ్యాం వాసయేద్వ్యభిచారిణీం. అని యాజ్ఞవల్క్యస్మృతి. వ్యభిచారిణీం భార్యాం కుచేల పిండపరిభూతాం నిర్వృత్తాధికారాం చాంద్రాయణం. ప్రాయశ్చిత్తం ప్రాజాపత్యం వాచారయేత్. అని ఔశనస వాక్యము. ౬౨.

శ్లో. అనురోధస్థితరసా నచశక్యప్రతారణా,
సాధ్వీసరిచ్చపత్యౌస్యా ద్విరసేప్యపరాఙ్ముఖీ. ౬౩.

టీ. అనురోధస్థితరసా-అనురోధ=అనుసరణమందు, స్థిత=వృద్ధిబొందిన, రసా= అనురాగముగలదియు, విరసేపి=అనురాగహీనుడైయుండినను, పత్యౌ = మగనివిషయమందు, అపరాఙ్ముఖీ=అనుకూలురాలైన, సాధ్వీ=పతివ్రత, శక్యప్రతారణా - శక్య= సాధింపదగిన, ప్రతారణా = వంచనముగలది, నచ = కాదు. అనగావంచింపరాదనుట.

అర్థాంతరము. అనురోధస్థితరసా - అనురోధ= గట్టుననుసరించి, స్థిత = ఉండునట్టి, రసా = జలముకలదియు, పత్యౌ = తనమగడైనసముద్రుడు, విరసేసత్యపి = లవణరసముగలవాడైనను, అపరాఙ్ముఖీ = వెనుకదిరుగనిముఖముగల, సరిత్ = నది, శక్యప్రతారణా - శక్య = సాధ్యమైన, ప్రతారణా = దాటవముగలది, న=కాదు.

తా. సముద్రము క్షారము కలిగియుండినను దానికి పరాఙ్ముఖముకాక తీరము ననుసరించియుండు నీరముగల నదిని యెట్లుదాటుటకు శక్యముకాదో, అట్లే అనురాగముచే ననుసర్తింపుచుఒకానొకవేళతనమగడుఅనురాగహీనుడైయుండినను తానుఅపరాఙ్ముఖురాలుకాకయుండుపతివ్రతను మోసముచేయరాదు. వర్షాకాలమందు నిండుగా పారుచుండునదులను దాటరాదనియు పతివ్రతనుమోసపరచరాదనియుభావము. ౬౩

శ్లో. నిత్యముత్కటదానానాం భద్రాణాం స్తంభముజ్ఝతాం,
నృపాణాంచద్విపానాంచ పురస్తాత్రంతనహిప్రియం. ౬౪.

టీ. నిత్యం = ఎల్లపుడును, ఉత్కటదానానాం = ఉత్కట - ఎక్కువైన దానానాం = వితరణము (ఈవి) గలిగినట్టియు, స్తంభం = గర్వమును, ఉజ్ఝతాం

విడుచునట్టివారుగనుకనే, భద్రాణాం = కల్యాణస్వరూపముగల, నృపాణాం = రాజులకు, పురఃస్తోత్రం = ముఖస్తుతి, ప్రియం = ఇష్టమైనది, నహి = కాదు.

అర్థాంతరము. నిత్యం=ఎల్లప్పుడును, ఉత్కటదానానాం-ఉత్కట=గండస్థలము నతిక్రమించునట్టి, దానానాం = మదోదకముగల, స్తంభం = కట్టుకంభమును, ఉజ్ఝతాం = విడుచునట్టి, భద్రాణాం = భద్రజాతియందుబుట్టిన, గజానాం = ఏనుగులయొక్క, పురః = ముంగల, స్తోత్రం = పొగడడము, ప్రియం = ఇష్టమైనది నహి = కాదు, (అథవా) తోత్రం = అంకుశము, ప్రియంనహి = ఇష్టమైనదికాదు.

తా. యాచకులకెల్లప్పుడు నిష్టార్థములనిచ్చుచు గర్వములేనివారై కల్యాణస్వరూపులగురాజులకు ముఖస్తుతిప్రియమైనదికాదు. "మహాసత్త్వోతిగంభీరఃకృపావానవికత్థనః" అనియుండుటచే ధీరోదాత్తులగువారికి వికత్థనత్వము అనగా పొగడించుకొనుట ప్రియముకాదనిభావము.

నిరంతరముగా చెక్కులందు మదోదకమునుగార్చుచు నాలానములను వదలించుకొను భద్రజాతియేనుగులకు స్తోత్రముచేతకాని లేక తోత్రముచేతకాని ప్రయోజనములేదు. ఏనుగులను సంతోషపఱచుటకై స్తుతించుటప్రసిద్ధము. భద్రజాతియేనుగులు మదించినవిగనుక అంకుశమునకు లోబడదనిభావము. ౬౪.

శ్లో. శుచేర్యస్యద్విజేంద్రస్య హృదయంహరిణాశ్రితం,
విరాజతిపదేవిష్ణో రతిక్రమ్యాశుభానిసః. ౬౫.

టీ. శుచేః=పరిశుద్ధుడైన, యస్య=ఏ, ద్విజేంద్రస్య=బ్రాహ్మణశ్రేష్ఠునియొక్క, హృదయం = మనస్సు, హరిణా = విష్ణువుచేత, ఆశ్రితం = ఆశ్రయింపబడియున్నదో, సః = ఆద్విజుడు, అశుభాని = దుఃఖములను, అతిక్రమ్య = దాటి, విష్ణోః = జగద్వ్యాపకుడైన ఈశ్వరునియొక్క, పదే=స్థానమందు, విరాజతి=వెల్గుచున్నాడు.

అర్థాంతరము. శుచేః = తెల్లనైన, యస్యద్విజేంద్రస్య = ఏచంద్రునియొక్క, హృదయం = బింబమధ్యభాగము, హరిణాశ్రితం = హరిణ - జింకచేత, ఆశ్రిత = పొందబడియున్నదో, సః = ఆచంద్రుడు, ఆశు = శీఘ్రముగా, భాని=నక్షత్రములను, అతిక్రమ్య = తనకాంతిచేనాచ్ఛాదించు, విష్ణోః = విష్ణువుయొక్క, పదే=స్థానమైనయాకాశమందు, విరాజతి = ప్రకాశించుచున్నాడు.

తా. ఏబ్రాహ్మణుడు పరిశుద్ధమైన తనమనస్సునందు సర్వవ్యాపకుడైన ఈశ్వరుని ధ్యానించుచున్నాడో వాడు సంసారజనితదుఃఖములనువిడిచి యీశ్వరస్థానమును బొందును.

తెల్లనైన బింబమధ్యమందు కురంగలాంఛనముగలచంద్రుడు తనకాంతిచేత చుక్కల వెల్గునుమాపి యాకసమున వెల్గుచున్నాడనియునర్థము. ౯౫.

శ్లో. దండేచకంటకాక్రాంతే కోశేచప్రథితోన్నృపః,
నాలంజేతుంకువలయం మిత్రేఽప్యసతిపద్మవత్. ౯౬.

టీ. నృపః = రాజు, కంటకాక్రాంతే = కంటక-పులకలచేత, ఆక్రాంతే= వ్యాప్తమైన, దండే = సైన్యమందును, కోశేచ = బండారమందును, ప్రథితః = విఖ్యాతిగలవాడైనను, మిత్రే = స్నేహితుడు, అసతి= లేనివాడుకాగా, కువలయం= భూవలయమును, లేక కుత్సితులసమూహమును, జేతుం = జయించుటకు, కంటకాక్రాంతే = కంటక - ముండ్లచేత, ఆక్రాంతే= వ్యాప్తమైన, దండే = తామరతీగయందును, కోశేచ = మొగ్గయందును, ప్రథితః = ప్రసిద్ధమైనను, మిత్రే = సూర్యుడు, అసతి = లేకుండగా, కువలయం = నల్లకలువను, జేతుం = జయించుటకు, పద్మవత్= కమలమువలెనే, నాలం = సమర్థుడుకాడు.

తా. యుద్ధోత్సాహముచే రోమాంచముగలసైన్యమును ఎక్కువైన ద్రవ్యమును గలిగియున్నను సుహృత్సహాయములేనిరాజు, తీగయు మొగ్గయు గలిగియుండినను సూర్యోదయము లేకుండెనేని వికాససంపదచేత నల్లకలువనుజయించలేని తామరవలెనే భూవలయమునుగాని దుర్జనులగుంపునుగాని జయించనేరడు.

ఉపకారాద్యతేఽప్యాశు మిత్రంశ్రేయనితిష్ఠతి, మిత్రవాన్ సాధయత్యర్థాన్ దుస్సాధ్యానపిధనాన్యపి అని కామందకము. తనకుపకారమును జేయకున్నను మిత్రుడైనవాడు శుభమొనగూర్చుచుండునుగనుక అట్టిమిత్రుడుగలవాడు సాధ్యములైన ప్రయోజనములను ధనములను సాధించుచున్నాడని భావము. ౯౬.

శ్లో. ద్విజస్సుమనసోహిత్వా భృంగవద్దానలిప్సయా,
ఆశ్రయన్నృపమాతంగాం శ్రుతేశ్శ్రుతినిషేధతః ౯౭.

టీ. ద్విజః = బ్రాహ్మణుడు, దానలిప్సయా = దానమును పొందవలయుననెడి యాసచేత, సుమనసః = దేవతలను, హిత్వా = విడిచి, నృపమాతంగాన్=చండాలులవలె అధములైనరాజులను, అథవా = ఏనుగలవలెమదించినరాజులను, ఆశ్రయన్ = పొందినవాడై, శ్రుతి నిషేధతః = శ్రుతి - వేదమందు, నిషేధతః = కూడదనిచెప్పియుండుటచే, దానలిప్సయా = మదోదకాభిలాషచేత, సుమనసః = పుష్పములను, హిత్వా=విడిచి, నృపమాతంగాన్=రాజగజములను, ఆశ్రయన్=పొందినదియై, శ్రుతి

నిషేధతః-శ్రుతి=వీనులయొక్క, నిషేధతః=తాడనములచేత, భృంగవత్=తుమ్మెదవలె సే
సీదేత్=దుఃఖపడుచున్నాడు.

తా. పుష్పములందలి తేనెగ్రోలుచుండెడి తుమ్మెదలు మిక్కిలి యాసజెంది పుష్పములనువిడిచి యేనుగుల మదము నాస్వాదించవలయుననిపోయివానియొక్క వీనుల దెబ్బలచేదుఃఖించునట్లు యాచకుడైనబ్రాహ్మణుడు దేవతలనారాధించుటమాని మత్తులైన రాజులనాశ్రయించి వారిచే సేలాభమునుపొందక వేదనిషిద్ధమైనయాచనావృత్తి నాచరించుటచే స్వధర్మభ్రష్టుడై నశించుచున్నాడు. ౬౭.

శ్లో. స్వపక్షమవధూన్వంతః పరానాశువిశంతియే,
గుణోజ్ఝితత్వాత్తేభ్యోఽపి చ్యవంతే తేశరాఇవ. ౬౮.

టీ. యే = ఏపురుషులు, శరాఇవ = బాణములవలె, స్వపక్షం = తమబంధుజనమును = తమ రెక్కలను, అవధూన్వంతః=విడిచినవారై=కదలించినవారై, పరాన్ = ఇతరులను=శత్రువులను, విశంతి = చేరుచున్నారో = పొందుచున్నవో, తే = ఆ పురుషులు = ఆబాణములు, గుణోజ్ఝితత్వాత్ = శీలమునువిడుచుటవలనను=అల్లెత్రాళ్ళను విడుచుటవలనను, తేభ్యోఽపి = ఆయితరుల వలననుండియు= ఆ శత్రువులవలననుండియు, చ్యవంతే = విడువబడుచున్నారు=జారుచున్నవి.

తా. ఏపురుషులు తమపరమైన బంధుజనమునువిడిచి యితరులను చేరుచున్నారో వారు గుణచ్యుతులగుటచే తమరెక్కలను వదలించుచు విలుకాని వింటియల్లెత్రాటి నుండి వెడలి శత్రువులందాకి మరల అందుండి జారుచున్నయంబులవలె, తమచేరినయితరులవలననుండియు విడువబడున్నారు. ౬౮.

శ్లో. భువనోత్తరకుల్యానాం భోగేష్వవ్యభిచారిణాం,
కేదారాణాంప్రకృష్టానాం నతృప్యంతికుటుంబినః. ౬౯.

టీ. కే = ఏ, కుటుంబినః = గృహస్థులు, భువనోత్తర కుల్యానాం - భువన = లోకమందు, ఉత్తర = అతిశయమైన, కుల్యానాం = వంశమందు పుట్టినట్టి వారు గనుక నే, అవ్యభిచారిణాం = పతివ్రతలైనట్టి, ప్రకృష్టానాం = ఉత్తమలైన, దారాణాం = భార్యలయొక్క, భోగే = అనుభవవిషయమందు, నతృప్యంతి? = తృప్తులు కారా? అనగా అగుదురు.

అర్థాంతరము. భువనోత్తర కుల్యానాం - భువన = నీటిచేత, ఉత్తర=అతిశయమైన, కుల్యానాం = కాలువలు కలిగినవిగనుక నే, అవ్యభిచారిణాం= ఎల్లప్పుడు

పండుచుండెడి, ప్రకృష్టానాం = చక్కగాదుక్కి చేయబడినట్టి, కేదారాణాం = వరి పొలములయొక్క, భోగే = అనుభవమందు, కుటుంబినః = గృహస్థులు, నతృప్యంతి= తృప్తినిబొందరా = అనగా పొందుచున్నారనుట.

తా. ఎప్పుడు నెడతెగక నీళ్ళుపారుచునుండు కాలువలుగలిగి చక్కగాదున్నుటచేత మిక్కుటముగా పండుచునుండు వరిపొలముల ననుభవించు సంసారులేలాగున సంతుష్టులగుచున్నారో, ఆలాగున మంచివంశమందు జనియించి పతివ్రతలగుటచే నత్యుత్తమలని పేరువడిసిన భార్యలయొక్క భోగమందు గృహస్థులు తృప్తినిజెందుచున్నారు.

శ్లో. భూపాలఃకరవాలశ్చ యోగక్షేమేచసప్రభుః,
యఃప్రసన్నముఖోముక్తకోశఃప్రత్యర్థిదానకృత్. ౧౦౦.

టీ. యః=ఏ, భూపాలః=రాజు, ప్రసన్నముఖః=ప్రసాదముతోకూడిన ముఖముకలవాడగుటచే,ముక్తకోశః-ముక్త=విడువబడిన,కోశః=ధనసముదాయముగలవాడై, ప్రత్యర్థిదానకృత్-ప్రత్యర్థి=యాచకులనుగూర్చి, దానకృత్ = దానముచేయువాడగుచున్నాడో, సః=వాడు, యోగే=ప్రజలయొక్క అలబ్ధలాభమందును, క్షేమేచ=లబ్ధపరిపాలనమునందును, ప్రభుః=సమర్థుడు, అగుచున్నాడు.

అర్థాంతరము. యః=ఏ, కరవాలః=ఖడ్గము, ప్రసన్నముఖః=నిర్మలమైనవాడిగలిగినదియు, ముక్తకోశః=ఒరనుండి విడబడినదియునై, ప్రత్యర్థిదానకృత్ - ప్రత్యర్థి=శత్రువుల, దాన=ఖండనమును, కృత్=చేయునదియో, సః=అఖడ్గము,యోగే=ప్రజలయోగమందును, క్షేమే=క్షేమమందును, ప్రభుః=సమర్థమైనదియగును.

తా. ఏరాజు ఈవిచేగలిగినసంతోషమును ముఖమందు గనఁబఱచుచు తనద్రవ్యమును యాచకులకొసంగుచున్నవాడో అట్టిరాజు ప్రజలయోగక్షేమములందు సమర్థుడగుచున్నాడు.

ఏఖడ్గము సానవేయబడినదగుటచేత వాడిగలిగినధారగలదియై యొరనుండి వెలుపడి శత్రువులను ఖండించుచున్నదో అట్టిఖడ్గమే ప్రజలయోగక్షేమములను ఘటింపజేసిరక్షించును. శౌర్యౌదార్యములుగల రాజేప్రజాపాలకుడని భావము. ౧౦౦.

శ్లో. అజన్యకంపాశ్శూరాయే నిత్యమప్యరాఙ్ముఖాః,
దర్శయత్యపరాంగంస పరేభ్యశ్చిత్రరూపవత్. ౧౦౧.

టీ. అజన్యకంపాః=జన్యకంపములేని, అనగా యుద్ధములవలనగలిగిన భయములేనివారుగనుకనే, నిత్యం=ఎల్లప్పుడును, అపరాఙ్ముఖాః=పోరునపువెనుదీయనట్టివారు,

యే=ఏవరో, తే శూరాః=ఆశూరులు, అజన్యకంపాః-అజన్య = పుట్టింపగూడనట్టి, కంపాః=చలనములుగల,నిత్యమపి=ఎల్లప్పుడును, అపరాఙ్ముఖాః=చిత్రములగుటచేవెనుకకుదిరుగనట్టి, చిత్రరూపవత్ = ఆలేఖ్యప్రతిమలవలె, పరేభ్యః = ఇతరులకు,శత్రువులకు, అపరాంగం=వీపును, నదర్శయంతి=చూపరు.

తా. కదలించుటకు గూడనవియై ఎల్లపుడు వెనుకకు దిరుగకనుండు గోడ మొదలగువానియందు వ్రాయబడిన చిత్తరువు లెవ్విధమున నితరులకు వెన్ను జూపవో, అవ్విధముననే శూరులగువారు జన్యమనగా యుద్ధమందు భయములేనివారై, ఎపుడును పిరికితనముచే నోడి వెనుదీయనివారై తమశత్రువులకు వీపు చూపరు. ౧౧.

శ్లో. నౌశ్చదుర్జనజిహ్వాచ ప్రతికూలంప్రసారిణీ,
ప్రతారణాయలోకానాం దారుణాకేననిర్మితా. ౧౨.

టీ. నౌః =ఓడ, కూలంప్రతి=గట్టునుగూర్చి, ప్రసారిణీ=సాగునదియై, లోకానాం = జనులను, ప్రతారణాయ=తరింపచేయుకొఱకు, కేన=ఎట్టి, దారుణా =కట్టెచేత, నిర్మితా=చేయబడెను.

అర్థాంతరము. దుర్జనజిహ్వాచ-దుర్జన = దుష్టుల, జిహ్వాచ=నాలుకయు, ప్రతికూలం=అనుకూలముకానట్లుగా, ప్రసారిణీ = ప్రవర్తించునదిగనుకనే, దారుణా = భయంకరమై, లోకానాం = సాధుజనులయొక్క, ప్రతారణాయ= మోసముకొఱకు, కేన=ఏసాధనముచేత, అథవా, కేన = ఏబ్రహ్మచేత, నిర్మితా = సృష్టింపబడెనో.

తా. ప్రతికూలముగా ప్రసారణముగలదియై జనుల ప్రతారణము కొఱకునైన యోడయు, దుష్టుల నాలుకయు నేబ్రహ్మచే నిర్మింపబడెనో అనియర్థము. ౧౨.

శ్లో. భుఙ్క్తే యస్యసదాభూరి జీవనంబాడబశ్శుచిః,
నదీనః సప్రభుర్నిత్యాం దుర్లంఘ్యామశ్నుతేదశాం. ౧౩.

టీ. శుచిః = పరిశుద్ధుడైన, బాడబః = బ్రాహ్మణుడు, సదా=ఎల్లపుడును, యస్య = ఏపురుషునియొక్క, భూరి = హెచ్చైన, జీవనం= బ్రతుకునకు కారణమైన ధనము మొదలగు దానిని, భుఙ్క్తే=అనుభవించుచున్నాడో, నదీనః = దీనుడు కానియట్టి అనగా నీవికలవాడైన, అథవా, దరిద్రుడు కానియట్టి, సః ప్రభుః = ఆపురుషుడు, నిత్యాం = నాశములేనియట్టి, దుర్లంఘ్యాం = అవశ్యమనుభవింపదగినట్టి, దశాం = ప్రభుత్వాద్యవస్థను, అశ్నుతే = పొందుచున్నాడు.

అర్థాంతరము. బాడబః=బాడబమనియెడి; శుచిః=అగ్ని, సదా= ఎపుడును, యస్య = ఏసముద్రముయొక్క, భూరి - అధికమైన, జీవనం = నీరును, భుఙ్క్తే = త్రాగుచున్నారో, ప్రభుః = శ్రేష్ఠుడైన, నదీనః - నదీ = వాకలకు, ఇనః=రాజైన, సః = ఆసముద్రుడు, నిత్యాం = అక్షయమైనట్టి, దుర్లంఘ్యాం = దాటగూడనట్టి, దశాం = రీతిని, అశ్నుతే = పొందుచున్నాడు, ౧౦౩.

తా. బడబాగ్నిచే నిత్యమును పానముచేయబడినను సముద్రమేలాగు క్షయింపక మిక్కిలివిస్తారమై దాటుటకు గూడనిదియైయున్నదో అలాగుననే సత్పాత్రమైన బ్రాహ్మణునకు ధనముమొదలగు వానిని దానం బొసంగినపురుషుండు నిరంతరైశ్వర్యమనుభవించుచు ప్రభుత్వావస్థను బొందుచున్నాడు.

శ్లో. శక్తశ్శబ్ద ఇవైకస్స్యాత్ సాధుశ్రుతిపథేస్థితః,
సదధ్యాహారపూర్ణస్య స్వార్థస్యప్రతిపాదనే. ౧౦౪.

టీ. సదధ్యాహారపూర్ణస్య — సత్ = సత్పురుషులందు, అధ్యాహార= వృద్ధికొఱకిచ్చుటచేత, పూర్ణస్య = నిండినట్టి, స్వార్థస్య= తనధనముయొక్క, ప్రతిపాదనే = దానమందు, శక్తః = సమర్థుడైన, ఏకః = ఒకపురుషుడు, సాధుశ్రుతిపథే - సాధు = సత్పురుషులయొక్క, శ్రుతిపథే = శ్రవణమార్గమందు, అథవా, సాధుశ్రుతిపథే = సద్వైదికమార్గమందు, స్థితః=ఉండువాడై, సదధ్యాహారపూర్ణస్య - సత్ = ఉండెడి, అధ్యాహార = సంబంధముచేత, పూర్ణస్య = సంపూర్ణమైన, స్వార్థస్య = తనశబ్దార్థముయొక్క, ప్రతిపాదనే = నిరూపణమందు, శక్తః = సమర్థమైనట్టి, సాధుశ్రుతిపథే = సత్పురుషుల శ్రవణమార్గమునందు,అథవా, సచ్ఛబ్దమార్గమందు, స్థితః = ఉండెడి, శబ్దఇవ = సుబంతతిఙంతశబ్దరూపములవలె, స్యాత్ = అగుచున్నాడు.

తా. కొఱవడియుండు అర్థమును పూర్తిచేయుటకై ఎక్కువపదమును దెచ్చుకొనుట కధ్యాహారమనిపేరు. అట్టియధ్యాహారముండుటచే పూర్తియై స్వాభిధాన నిరూపణమందు సమర్థమై విద్వాంసులచే వినుటకుయోగ్యమైన శబ్దరూపమువలెనే యొకానొక పురుషుడు వృద్ధికొఱకై సజ్జనులందుంచబడిన తనద్రవ్యమును దానమందు వ్యయము చేయుచు సత్పురుషులందు ప్రఖ్యాతి గలవాడైయుండును. ౧౦౪.

శ్రు. దానం యజ్ఞానాం వరూథం దక్షిణాలోకే దాతారగ్ం సర్వభూతా న్యుప జీవంతిదానే నారాతీరపానుదంత దానేనద్విషంతో మిత్రా మిత్రాభవంతి దానేసర్వం ప్రతిష్ఠితం తస్మాద్దానం పరమంవదంతి. అను శ్రుతివాక్యమువలన ముఖ్యముగా పురుడు కావలయునని భావము. ౧౦౪.

శ్లో. మహాంత్సఏవపురుషో యస్యసత్యానురోధినః,
ఆక్షిప్తపారిజాతేన బాహునారక్ష్యతేజగత్. ౧౦౫.

టీ. సత్యానురోధినః=సత్య-యథార్థభాషణమును, అనురోధినః = అనుసరించియుండెడి, యస్య=ఏపురుషునియొక్క, ఆక్షిప్తపారిజాతేన-ఆక్షిప్త= తనయీవిచే నిరాకరింపబడిన, పారిజాతేన=కల్పవృక్షముగల, లేక, ఆక్షిప్త=తిరస్కరింపబడిన, పారిజాతేన =భృత్యులుగల, బాహునా=భుజబలముచేత, అనగా అసహాయశూరత్వముచేత. జగత్ =లోకము, రక్ష్యతే = పాలింపబడుచున్నదో, సః = అట్టి, పురుషఏవ = పురుషుడే మహాన్=శ్రేష్ఠుడు.

అర్థాంతరము. సత్యానురోధినః-సత్యా=సత్యభామను, అనురోధినః=అనుసరించుచున్న, యస్య=ఏ శ్రీకృష్ణునియొక్క, ఆక్షిప్తపారిజాతేన=ఆక్షిప్త=పెరికి వేయబడినట్టి, పారిజాతేన = పారిజాతవృక్షముకలిగినట్టి, బాహునా= భుజముచేత, జగత్ = లోకము, రక్ష్యతే=పాలింపబడుచున్నదో, సః=అట్టి, పురుషఃఏవ=పురుషోత్తముడైన శ్రీకృష్ణమూర్తియే, మహాన్=గొప్పదేవుడు.

తా. సత్యమువిడువక భూభారమును తనభృత్యులగు రాజపురుషులం దుంచక తనబాహుబలముచేతనే భూపరిపాలనముచేయు పురుషుడే హెచ్చైనవాడనియు, రుక్మిణీదేవికి పారిజాతపుష్పమిచ్చుటచే అసూయాపరవశయగుసత్యభామచే ప్రార్థింపబడినవాడై ఇంద్రలోకముననున్న పారిజాతవృక్షమునే తెచ్చి సత్యభామ గృహమందు నాటి కంసాదిదుష్టులనడంచి లోకములనుపాలించెడి శ్రీకృష్ణమూర్తియొక్కడే దేవాదిదేవుడు.

కావ్యముయొక్క ఆదిమధ్యాంతములందు మంగళంబాచరించుట శిష్టాచారంబుగాన నీగ్రంథమందు ప్రారంభమున "గుణదోషౌబుధోగృహ్ణన్" అనుశ్లోకమున పరమేశ్వరగుణవర్ణనరూపమైన మంగళమును; మధ్యమందు "స్వస్థానాదపరోహ్య" అను మొదలగువానిచేతను; తుదియందీశ్లోకముచేతను మంగళము నాచరించియున్నాడు. సంస్కృత

వ్యాఖ్యయందు "అత్రాదౌ త్రయాత్మాది నాథ గవన్న్వర్ణ నరూపో మంగళాచారః కృతః" అనియుండుటచే నీగ్రంథమునకు ముఖమందు షోడశోక శ్లోకముండునటుల దోంచుచున్నది.

కం. దొరసామినృసింహమణియా
వరకృతికిఁ దెనుఁగుటీక వ్రాయుమటంచున్
బురికొల్ప శ్రీనివాస, న
గరనిలయుఁడు లోకనాథకవి యిటువ్రాసెన్.

శ్లో. సాక్షరావ్యత్యయాల్లోకే రాక్షసా ఏవ కేవలం,
కవిరాక్షస ఏవాయం గవిరాక్షస కృత్యతిం.

ఇది శ్రీ శ్రీనివాసపుర సుబ్బరాయార్యపుత్త్రి లోకనాథకవి
విరచితంబైన కవిరాక్షసీయాంధ్రవ్యాఖ్యానము
సంపూర్ణము.



చ. ఇది తటి యయ్యెఁ జంద్రుఁ డుదయింపఁ డదే? యుదయింపకుండు నె?
ట్లుదయముపై మొగుల్ గ్రోవిది యున్నది యింతియె కాక యద్దెసం
బొదలెడునాఁకట న్బడలెఁ బొమ్మ చకోరము లంత యేల పై
నొదవెడు మేఘము ల్దొలఁగ కుండఁగ వచ్చునె శీతరోచికిన్? 207

వ. అని యిట్లు నర్మగర్భంబుగా నన్యాపదేశవచనసందర్భంబులం దనతలంపున కనుగుణం బులు గాఁ బ్రత్యుత్తరంబు లిచ్చినప్రౌఢతనంబునకు మెచ్చి పాలికకు నితరసఖీజనం బులకుం గర్పూరవీటిక లొసంగిన నచ్చెలులును విభునిహృదయపరిపాకం బెఱింగి యొక్కొక్కనెపంబునం గన్నియ నొఱంగి యందఱుం గ్రీడామందిరంబు వెలు వడినయనంతరంబ. 208

## నవోఢాసంగమవర్ణనము.

క. కెలనిమణికుడ్యతలమునఁ, బొలసినతననీడ దోడిబాల యనుచు న
చ్చెలువ విభుఁ డంత నొయ్యనఁ, బలికించినఁ దెలిసి యులికిపడి వెడలు నెడన్. 209

ఆ. చెట్ట యొడిసిపట్టి సెజ్జకుఁ దివియుచో, నడుగు బిగ్గఁ ద్రొక్కి యతివ యపుడు
కూర్మి విభునిమీఁద గోనయి మెక్కించుచో, నల్ల వంగుమరునివిల్లువోలె. 210

చ. తలిమముఁ జేరకున్న మదిఁ దత్తఱ మెత్తి విభుండు బాలికన్
నిలువునఁ గౌఁగిలింప రమణీరమణీయశరీరయష్టి ము
త్పులకిత మైనఁ బొల్పెసఁగె భూవరకల్పకబాహుశాఖలన్
వలగొని యున్నకోరకితవల్లిమతల్లియుఁ బోలె నయ్యెడన్. 211

సీ. వెడలి పోఁ దలఁచుచో నొడిసి కేల్పట్టినఁ దిరిగి నెచ్చెలిఁ జూచు దీనదృష్టి
శయ్యకుఁ దిగుచుచోఁ జను దేక బిగ్గరఁ జరణాంబుజము ద్రొక్కు చండితనము
బలిమిఁ గౌఁగిట గ్రుచ్చి తలిమంబుఁ జేర్చుచో నొడఁబాటు చాలనినిడుదయూర్పు
ముంగేల వంచిన మొగ మెగయించుచో మెయికొను నేత్రనిమీలనంబు
గీ. మాటలాడక చేకొన్నమానముద్ర, యైదునివి పంచబాణుని కైదువూపు
లయ్యెఁ బతిడెందమునఁ గాఁడునట్టు లేయ, నంగనామణినవిక్రొత్తసంగమమున. 212

సీ. తలవంచుటయె కాని తప్పక కనుప్రేమ ఘన మని లోచూపుగతము వెట్ట
మానముద్రయె కాని మాటాడువేడుక గడు సని ముఖకాంతి ముడియ వేయ
నడ్డగించుటె కాని యాలింగనప్రీతి బలు వని కంపంబు బాస సేయఁ
బైవెట్టమియె కాని పైకొనుతమికల్మి సత్తని పులకలు సాక్షి పలుకఁ
గీ. గరుణముగ నేఁడ జోకమియె కాని మనసు, కరఁగినది యని చెమట పైకంటఁ జాట
హృదయనాథుని మది దక్క నేలుకొనియె, బాలికామణి యపుడు బాఁ బ్రథమరతిని.

చ. బలిమి రసాతిరేకమునఁ బయ్యెదకొం గెడలింపఁ గంపముం
దళుకును గల్గుతొల్కరిఁ గనంబడుక్రొత్తమెఱుంగుఁబోలె న
ప్పొలఁతిమెఱుంగుమేనదియుఁ భూవరుతాల్మి మరుండుఁ డెంపఁగాఁ
బెలుచ నొర న్వెడల్చి జళిపించుకృపాణిక యయ్యె నయ్యెడన్. 214

క. కొల్లలు గో నజ్జాడెడు, వల్లభుదృఙ్మధుపతతుల వ్రాలఁగనీ కు
త్ఫుల్ల కుచగుచ్ఛములఁ గర, పల్లవపుటయుగళిచేత బాలిక పొదివెన్. 215

గీ. కంకణక్రేంకృతులపేరఁ గలహ మాడి, యధిపుకరములతో బాలహస్తయుగము
సరిఁ బెనంగఁగ నా కేల జగడ? మనుచు, జాఱుగతి నీవి తనుఁ దానె జాఱె సతికి.

గీ. పయ్యెద బలము దూలినఁ బఱఁచె బాహు, శక్తిఁ గుచదుర్గములఁ గాచి జాఱునీవిఁ
బట్టఁ బోయిన రాజుచేఁ బడియె రెండు, భేదమున నెంతకార్యంబు గాదు తలఁప?

గీ. ముగ్ధ యగుఁ గాక యే? మింత ముగ్ధ గలదె?, బాల జఘనాంశుకం బింక నేల పెనఁగ?
రాజవరున కురోజదుర్గములు రెండుఁ, జేపడియె నట్టె యిఁకఁ గ్రిందిసీమ యెంత?

క. ఒడిసి జఘనాంశుకం బపు, డెడలించినవిభునిదృష్టి కెడయీనిమతిన్
బడఁతుక లజ్జావశమునఁ, గడువడితోఁ బొదివి బిగ్గఁ గౌఁగిటఁ జేర్చెన్. 219

ఉ. చూడనిచూడ్కియు న్బలుకఁ జూడనివాక్కును గౌఁగిలింపఁగాఁ
జూడనికేలుఁగంటి యిడఁ జూడనిమోవియుఁ మాఱుసేయఁగాఁ
జూడనిచెయ్వుఁ బైకొనఁగఁ జూడనికాయముఁ గగ్గి తొల్త్రోలిన్
జేడియసంగమంబు నృపుచిత్తముఁ దత్తఱ పెట్టె నింపునన్. 220

చ. వెఱపు నలంతికంపమును పీడనిప్రీడయు మాఱుసేయఁగా
నెఱుఁగమి యేపులేమి పరియెత్తెడుచొక్కులగోలు ముందుగా
మఱుపుమొగంబు నోరయును మాటుగ నెప్పలఁ గప్పుచూడ్కియుం
దెఱప నవాగ్రసంగతిఁ బ్రతిక్రియలై యలరించె భూవిభున్. 221

సీ. కేలితోఁ గేలుకెంగేలఁ గీలించుచోఁ బులకోద్గమము వెంట వెలువరించి
యొయ్యనొయ్యన మీఁదిపయ్యెదఁదివియుచోఁ బొడముకంపములతో నెడలఁదూల్చి
కడునించుమెత్తనికౌఁగిటఁ జేర్చుచోఁ గ్రమ్ములేఁజెమటలఁ గరఁగ జార్చి
మరపించి యుల్లనిమర్మంబు లంటుచోఁ బుణికిళ్ల నెళవులు పుణికి వైచి

గీ. పలుదెఱంగుల మడిసిగ్గు వెలితిపఱచి
దినకరాన్వయుఁ డొకకొన్ని దినములకును
బొలఁతియెడఁ బూన్కి కొడఁబాటుపొందుఁ గాంచె
నిగ్రుచుకోర్కులఁ దనడెంద మివతళింప. 222

సీ. పదిప్రశ్నముల కైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ జూచువీనులకింపు రేఁచిపెట్టి
నిరువదిపొంచుల కెదిరించు నొకచూపు కనుబండువకు సంచకరువు గాఁగ
ముప్పదికౌఁగిలింపులఁ గాంచుబిగి యెందుఁ జోఁకుచోఁ గొనగోరు సోఁకఁ జేయ
నలువదిమనవులఁ గలయొక్కయొడఁబాటు పారవశ్యమునకుఁ బరిసనముగ

గీ. నడ్డగింపును గాక నయ్యాట లేక, యంతరాళంబు లోకకొన్నియహము లహహ!
వేఱ యొకకొంత రుచి గొల్పె విభునిమదికిఁ, గిసలయాధరతో రహఃక్రీడనములు.

సీ. నెమ్మోవి దాఁచెడినెపమునఁ జెక్కులు చుంబింప నెడ మిచ్చుసుదతి నేర్పుఁ
గినిసి చెక్కులు దాఁచికొనియెడినెపమున మోము మోమునఁ గూర్చుముదితవెరవు
వెడలెడితననీవి సవరించునెపమునఁ గౌఁగిటి కొదవించుకాంతతలఁపుఁ
గరములఁ జనుదోయిగప్పునెపంబున నీవిక సందిచ్చునెలఁతమతముఁ

గీ. దొడిఁబడక గానఁ బడనీక యొడలు నులియు, నెపముమైఁ గౌఁగిటికెదుర్చునీరజాక్షి
యుపమయును భూమివల్లభునుల్లమునకుఁ, గ్రొత్తచవిగొల్పె మఱివేఱె కొన్నినాళ్లు.

ఉ. చేసినచోఁ బ్రతిక్రియలు సేయనెఱుంగమి మున్ను తోడుతోఁ
జేసినచేఁతకు న్మరలఁ జేయఁగ వేడుక సేసి యంతటన్
జేసినఁ జేయఁ జొచ్చెఁ: జెఱుచెయ్వుల నంతట బ్రోఢ యై తుదిన్
జేసెఁ బయోజనేత్ర పతిసేయకయున్ రతిఁజేయుచెయ్వులన్. 225

సీ. ఈక్షింపఁగా నేర్చె నిక్షింకుఁజూపుల మోవిఁ గూర్పఁగ నేర్చె మొలకనవ్వు
పొలయింపఁగా నేర్చె భ్రూలతానటనంబు విన నేర్చె నర్మోక్తి వీను లాని
యెదురొత్తఁగా నేర్చె నిఱియుఁ గౌఁగిటియందు మొగమెత్తఁగా నేర్చె మోవిఁ గముప
గర మెత్తి యీనేర్చెఁ గర్పూరవీటిక నలరింపఁగా నేర్చె నంఘ్రి లెత్తి

గీ. నేర్చె గరువింప మెచ్చింప నేర్చెనేర్చె, మొగము గనుపట్టి యలుకమైమ్రొక్కుగొనఁగ
జెలువపతిచేతిరతికళాశిక్షణమునఁ, బంచబంగాళముగ లజ్జఁ బాఱఁదోలి. 226

వ. ఇట్లుక్రమక్రమప్రవర్ధమానంబు లగుప్రణయంబులచందంబునం బ్రోఢతనంబులు సమ
ప్రవృత్తంబు లై. 227

సీ. మొఱఁగి కన్గొనుచోట మొఱఁగుపై మతి దప్పిపోక యొండొరుల నాపోకచూచి
సిగ్గునఁ బలుకుచో సిగ్గుపై మతి దప్పి యిచ్చనొండొరులతో ముచ్చటాడి
నెపముగఁ బొంకుచో నెపముపై మతి దప్పి కాంక్ష నొండొరు బిగ్గఁ గౌఁగిలించి
తాలిమి నెఱపుచోఁ దాల్మిపై మతి దప్పి కాయ్యమై నొండొరుఁ గడవఁ గరఁగి

గీ. గుట్టు చెల్లింపలేక లోగుట్టువడని, తమమతులకూర్మి నివ్వెఱతమక గదురఁ
బూవిలుతుచేతిచిత్రంపుబొమ్మ లగుచు, జంపతులు సల్పి రంగజస్వైరవిధులు. 228

ఉ. సిగ్గునకుం బికాపికలు చిత్తసమున్నతి పేరివార్తకుం
గగ్గులకాళ్లు శంకలకుఁ గన్కనియొగ్గులఁ బుట్టునల్కకు
న్నగ్గిసముగ్గిసల్ నిలుపునైరణకు న్గనసీనియొత్తికో
ళ్గగ్గజయానకుం బతికి నయ్యె యభీష్టరహఃప్రసంగముల్. 229

చ. అలిగినవేళ నయ్యెడినిజాంగజతాపము పేరియెండలున్
గలసినవేళ నయ్యెడిమొగంబులనవ్వుల పేరివెన్నెలల్
దలఁచుటె కాని యవ్విభుఁడు దన్వియుం సంతతకేలిలోలతన్
దలఁప నెఱుంగ రెన్నఁడు దినంబులయెండలు రేలవెన్నెలల్. 230

సీ. మాధవీమధుపానమత్తాలినీగానవిభవాకులోద్యానవీథికలను
జంద్రికానిర్ధూతజలదపథోపేతశశికాంతకలధౌతసౌధములను
గాదంబినీజాలకలకలవాచాలశైవలినీలోలసైకతములఁ
గలితలీలాయత్నకల్పితగిరినూత్నకాంతి నానారత్నకందరముల
గీ. మఱియు వివిధవిహారైకమందిరముల, నిచ్చనిచ్చలు క్రొత్తలై యెచ్చరించు
ఖేలనంబులఁ దెప్పలు దేలుచుండె, నెలఁతయును దాను మాంధాతృనృపవరుండు.

## ఆశ్వాసాంతము.

శా. ఆర్తిక్షీణగజేంద్రరక్షణ కళావ్యాఘాతవిఖ్యాతిమ
త్ర్రైత్వాప్రతిమల్ల పల్లవసతీకౌమారహారక్రియా
ధూర్తాగ్రేసర సవ్యాసంభవ లసద్వ్యాఘాంతరంగస్థలీ
మూర్తాస్తద్విధభాగధేయ శరదంభోజాతపత్రేక్షణా. 232

క. డోలాలీలాందోళన, ఖేలాస్వాగతాగతాభివీక్షణజనితో
ద్వేలప్రమదాంబుధిక, ల్లోలప్లవవస్మదాదిలోకస్వాంతా. 233

భుజంగప్రయాతము.—
అభద్రాంధకారోదయద్భానుభావా, శుభైకాశ్రయీభూతశుద్ధస్వభావా
యభక్తావళీదృష్ట్యహఃకాలతారా, స్వభక్తాగ్రభూపారిజాతావతారా. 234

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరోజసేవకోపసేవక నరసింహనామధే
యప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబునవాయికానిరూపణంబును, యౌ
వనవర్ణనంబును, విప్రలంభంబునందు దశదశానిరూపణంబు, వివాహంబును, నవో
ఢాసంగమంబు నన్నది తృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.



రంగనిలయ వలయా
కారాభయముద్రితైకకరకిసలయ లీ
లారసనిరంకుశస్వే
చ్ఛారచితజగత్ప్రసూతిసంస్థితివిలయా. 1

## వసంతర్తువర్ణనము.

ఉ. భాసురలీల నయ్యె నిలపై మధుమాసము గర్వితేక్షుబా
ణాసకృతాట్టహాసము భయాకులపాంథవిముక్తదీర్ఘని
శ్వాసము కోపనాధృతినివాసము కోకిలకీరషట్పదో
ల్లాసము చత్తభూరుహవిలాసము సర్వమనోవికాస మై. 2

ఉ. ప్రాయము భూరుహంబుల కపాయము మంచున కాపతత్పవి
ప్రాయము పాంథకోటికి నుపాయము చిల్కలకున్ సమాపనా
ధ్యాయము కోపనాధృతికి దాయము చల్లనిగాలి కెన్నఁ గా
నాయము పుష్పబాణునకు నామని నే మని ప్రస్తుతింపఁగన్. 3

చ. తెగినమనోభవుం దిరుగఁ దెచ్చి కుజంబుల కెల్లఁ బ్రాయము
ల్మగుడఁగ నిచ్చి యన్యభృతమండలిమూఁగతనంబు వుచ్చి ము
జ్జగముల వార్త కెక్కినవసంతభిషగ్వరుఁ డాప్తుఁ డయ్యెనుం
నగుగతి మాన్ప లేఁడ మఱి దక్షిణవాయువునందు జాడ్యమున్. 4

క. తొలఁగి చిరకాలమునకుం, గలసినమాధవునిమీఁదఁ గనలి వనశ్రీ
తలిరుల నెఱ్ఱంబాఱుచుఁ, గలకంఠప్రథమవాక్యగతులం గొణఁగెన్. 5

ఉ. ఆసమయంబున న్మధుసమాగతలక్ష్మి వనప్రవేశముం
జేసినవేళఁ జూడ బొలిచెం బికషట్పదభూతతృప్తి గాఁ
బోసినమాంసపుంజములపోలికఁ బల్లవితామ్రసంచయం
బాసపపాత్రలయ్యె వకుళాగ్రదళమ్ముకుళప్రతానముల్. 6

ఉ. పొన్నలు నవ్వెఁ గ్రొన్ననలపుష్పరసంబునఁ గేసరంబు లు
త్పన్నజుగుప్స మై నుమిసెఁ బాటలము ల్కుసుమోదయంబుచేఁ
గన్నెఱ చేసెఁ దిట్టెఁ గలకంఠరుతంబులఁ జూతము ల్వృథా
మున్నుగ నన్నిటం గడచి మోదుగుపువ్వులవిఱ్ఱవీఁగినన్. 7

చ. చిగురులచేతఁ గోయిలలఁ జిత్రఫలంబులచేతఁ జిల్కలం
దగుపువుఁదేనెచే నలులఁ దావులచే మలయానిలంబులన్
మొగడలచేఁ బ్రసూనశరు మోదితుఁజేసి యభీష్టదంబు లై
పొగడిత కెక్కెఁ గల్పకముఁ బోలె రసాలకుజంబు లామనిన్. 8

సీ. వివిధవనీరమావిమలసాంద్రకటాక్షవీక్షాపరంపరావిలసనములు
మలయమారుతచరన్మత్తేభచరణావలంబితాయతశృంఖలాలతికలు
పథికజనావలీప్రతిసమాకర్షణప్రద్యుమ్నముక్తదోఃప్రగ్రహములు
మధుజగన్మోహనమంత్రవాదికరాబ్జవలమాననలినాక్షవలయితములు

గీ. ప్రథమకౌమారనవపరిపాకకలన, వికసదభిమతతరులతాగ్రకరమంజు
మంజరీమధుమధురిమోన్మాద మెసఁగ, మెలఁగె బహువిధగతులఁ దుమ్మెదలగములు. 9

చ. పనిపడి హారదంతురితపాండ్యవధూకుచశైలసంధులన్
ఘనముగ డస్సి చోళనవకంజముఖీరతిఘర్మవారి నా
ని నెఱిని గుంతలీసురభినిశ్వసనంబుల నూఁత గొంచు నొ
య్యనఁ జనుదెంచె నంత మలయాచలశీతలవాతపోతముల్. 10

క. మమ్మురపుందేనెలజడి, చెమ్మ లపనవీథు లెల్లఁ జెన్నగుటఁ జుమీ!
కమ్మవిరితావి మోపరి, తెమ్మెర లొయ్యొయ్య వెఱచి తిరుగుట లెల్లన్. 11

చ. చలువలపుట్టినిండ్లు నవసౌరభలక్షుల కంతరంగముల్
మెలఁపునకు న్నివాసములు మెచ్చులచేరుగడల్ విరక్తతా
కలనల కెత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లామనిన్
మలయుచు వచ్చె గంధగిరిమంథరబంధురగంధవాహముల్. 12

సీ. రేల వెన్నెలలు పండ్రెండుసూర్యులు చూపుబీరెండ లై కాసి నీరసింప
దక్షిణానిలము లుద్ధతి నేడుదెఱఁగులఁ బెరిగెడుగాడ్పు లై పెల్లగింపఁ
గెంజాయ దిక్కులఁ బింజించుచిగురులు కాలానలార్చు లై కాఁకఁ బెనుప
నలి శుకపికగర్జ లడరఁ బూదేనియఘోరాంత్యవృష్టి యై కురిసి కలఁప

గీ. విరహవేదన లెసఁగి యుద్వేలగతుల, నద్భుతముగ నేకార్ణవ మగుచు ముంప
నఖిలసుఖకారి యగువసంతాగమంబు, పథికలోకంబునకు మహాప్రళయ మయ్యె.

ఉ. పూచినపువ్వులెల్ల నుతిఁ బొందె మనోభవునంపకోలలై
వీచినగాడ్పు లెల్లఁ బొదలెన్ మలయాచలమారుతంబులై
యేచినపల్కు లెల్లఁ దగియెన్ బికభృంగశుకస్వరంబులై
చూచినరూప మెల్ల మదచుంబిత మై విలసిల్లె నామనిన్. 14

చ. ప్రసవశరప్రతాపశిఖిఁ బర్వఁగఁ జేయుటచే నిదాఘమై
కుసుమరసాతివర్ష మునకున్ గుదు రౌటఁ బయోదకాలమై
రసికమనోంబుజంబు లలరంగ శరత్తయి తాన శైశిరో
ల్లసనముఁ జూపి పాంథసతులన్ వణఁకించె వసంత మత్తఱిన్. 15

## మాంధాత యువతులఁ గూడి వనవిహారము సల్పుట.

వ. ఇట్టివసంతసమయంబున మహీరమణశేఖరుం డొక్కనాఁడు విహారకుతూహలంబునం
బ్రేయసీసమేతుం డై గణికాగణంబులు విటవిదూషకాదిక్రీడాపరికరజనంబులు
నర్మవాహనారూఢు లై కొల్చి రా విరచితోచితవివిధవిచిత్రక్రీడాలతాగృహాలంకృ
తాంతరంబునుం గేళీశైలశైవలినీప్రముఖనానావిహారప్రదేశోపశోభితంబును వసంత
విలసితస్వవిలాసాపహసితనందనంబును నగునగరోపవనంబు సొత్తెంచె నప్పుడు. 16

ఉ. ఇంచుగతిం బరాగ మెగయించియు వెంటన వచ్చుతేంట్ల మ్రోఁ
గించియుఁ గమ్మతావు లోలయించియుఁ బై మకరందబిందువుల్
నించియు మెచ్చి తన్ బొగడునేర్పు లొసంగుచు నెల్లవారికిన్
బంచవిధేంద్రియంబులకుఁ బండువు చేసె వనీసమీరముల్. 17

వ. ఇట్లభిమతప్రమదవనసమీరంబు లెదురుకొనం గ్రీడావనమధ్యంబు దఱిసి వివిధమధుర
తరులతావిశేషంబులం గలుగునభినవకుసుమకిసలయఫలపరాగమకరందమిళిందశుకపిక
మిథునసంపదల నుత్కర్షించుచుం గలయ మెలంగి పుష్పాపచయముఖేచ్ఛావిహారం
బులకు నందఱ నద్దినం బెల్ల నచట నిలువ నియమించి పాలికాదిసఖీజనంబులు గొలువ
విమలాంగియుం దానును వసంతునింటికి విందువచ్చురతీసహాయుం డైనమన్మథుండు
నుంబోలె నొక్కయభ్యంతరవనాంతరంబు చొచ్చి యందు. 18

సీ. నవలీల మలయగంధవహుండు వివిధపుష్పామోదముల నుపాయన మొసంగఁ
గలకుహూరుతములఁ గలకంఠములు సవినయభంగి విజ్ఞాపనంబు చూపఁ
బరిపక్వఫలరసప్రణతిమైఁ దరువులు కిసలయాంజలిపుటీక్రియ ఘటింపఁ
గలితప్రసూనసంగతి వల్లికలు తల్పరచనామహోపచారము నొనర్ప

గీ. లలనతో రాజు వనవీథికల సుఖించె, మంజరీపుంజనిష్యందమానమధుర
మధురసాస్వాదసమ్మోదమధుపగీతి, మాధురీధుర్యమాధవీమండపముల. 19

## పుష్పాపచయకేళీవర్ణనము.

వ. అంత నిటఁ దరుణీతరుణజనంబులు పుష్పాపచయవినోదంబులం దగిలి విహరించు నప్పుడు. 20

సీ. అలరుల కెత్తుచో నఱచేతికెంజాయలొదవి కోయిలల నోరూరఁ జేయ
నునుమేను లలసి మ్రానులమీఁద నొరగుటల్ తీవలు ప్రాఁకిన తెఱఁగు దెలుపఁ
జెలికత్తియలలీలఁ బిలుచునున్పలుకులు మదకీరములముద్దుమాట లార్ప
బుగబుగ వలచునూర్పులతావు లెసఁగి క్రొన్ననలకు వింతవాసన లొసంగ

గీ. నిక్కి కొనకొమ్మ లందుచో నీవి జాఱి, బయలువడి యొప్పునాభికూపములసొబగు
లంగలతలకు నరవిరులై చెలంగ, సతులు పుష్పాపచయకేళి సలిపి రర్థి. 21

చ. చనుఁగవకంటె గుచ్ఛములు చక్కనయే? యధరంబుకంటె నే
ననుచు చిగుళ్లు ? నీదువచనంబులకంటెనె చిల్కపల్కులున్?
వనమున నాకుపింతలఁటె వస్తువు? లంచు నివృత్తుఁ డయ్యెఁ దో
డన యొకఁ డల్కమైఁ దనపడంతుక క్రమ్మఱ యింటి కేగఁగన్. 22

చ. పొడవున నున్నపల్లవునిఁ బూవులు వేఁడుచు నొక్కనెయ్యపుం
బడఁతుకహస్త మెత్తుటయుఁ బయ్యెద జాఱి కుచోదయాద్రిపైఁ
బొడిచి వినూత్నరాగరుచిఁ బొల్పువహించునఖాంకచంద్రు చే
ముణిఁగె నొకంతలో సవతిముద్దియపిండుముఖారవిందముల్. 23

చ. అందినవారు పుచ్చుకొనుఁడా యని చేవిరిబంతి యెత్తినన్
జందనగంధు లిద్దఱొకజాణనిపేఁపు నురంబుఁ జన్నులా
సందునఁ జిక్క నొక్కుచును సారెకు నిక్కఁగ శంబరారిచేఁ
జెందలిరాకువాలునొఱచేఁ బెడపోటనుబోనివ్రేటునన్. 24

చ. ఇరువురయందు ము న్నొకతె కిచ్చిన నొక్కతె యల్గు నంచు మీ
యిరువురలావు గాన నగునీవిరిఁ గైకొనుఁ డంచుఁ బల్లవుం
డిరువురముందఱన్ బడఁగ నేసినఁ దత్కపటం బెఱింగి మ
మ్మిరువుర సాటి సేయఁ దగునే? యని యొక్కట నల్గి రిర్వురున్. 25

చ. తనప్రియుమీఁద నొక్కలత తార్కొని గుచ్ఛయుగంబు మోఁపినన్
గినిసి సపత్ని గాదని సఖీజనసాక్షి నెఱింగినట్టియం
గననికటంబునన్ సవతికాంతునిపైఁ బడి పెన్నురంబునన్
జనుఁగవ మోఁపినన్ గినియఁ జాలద వేఱొకతీవ యన్మతిన్. 26

చ. పిలిచితి నన్ను వేఱొకతెపేరున నే నివి యొల్ల నంచు మ
న్నలిగె నొకర్తుపల్లవున కవ్వల నొల్లక రోసినట్టిపూ

యలరుల నిచ్చెదే యనుచు నర్గె సపత్నియు నట్ల కాదె ధూ
ర్తులు తుద నెల్లవారలకు దూరుల పోతలపోసి చూచినన్. 27

చ. తనుఁ బెరపేరఁ బిల్చి యిడఁ దత్కుసుమంబులఁ పూఁచి మోమునన్
గినుపున వ్రేసె నొక్కసతి కేసరరేణువు రాలె నంచుఁ జెఁ
గనుఁగవ మూసికొన్న వెతఁ గౌఁగిటఁ జేర్చుచుఁ గేలువుచ్చి చూ
చిన నగుధూర్త పల్లవుని చేఁతకు గాసిలి యల్గెఁ గ్రమ్మఱన్. 28

ఉ. నేరవు నీవు కొప్పిడఁగ నే ఘటియించెదఁ బువ్వు లంచు నం
భోరుహలోచనన్ దిగిచి ముందర నుండఁగఁ బంచి యొక్కరుం
డీరస మొందు తోడిసతి కివ్వలమోము మలంచి చుంబనా
చారము చే మనఃప్రియము సల్పె సఖుల్ తననేర్పు మెచ్చఁగన్. 29

చ. సవతిమొగంబు చూచుచు నొసంగినపల్లవుమీఁది కిన్పునన్
దవిలిన నెవ్వఁగం దనువు తప్తముగాఁ దలవంచి యున్నయ
య్యువతికరంబులో నివిరు లొప్పతఁ గందుట చెప్ప నేటికిన్?
గవిగొనుదానియూర్పులసెకన్ గసుగందె పసంబుపువ్వులున్. 30

చ. చిగురులఁ గర్ణపూరములు సేయుతలంపునఁ గోయునంతలోఁ
దగ వఱి యవ్వలన్ విటుఁడు తాను సపత్నియుఁ గూడుకొన్న నె
వ్వగ నొకపువ్వుఁబోఁడి వలవంతల వేఁగుచుఁ జేత నున్నయా
యిగురులె సెజ్జ చేసికొని యొందను తాపభరోపశాంతికిన్. 31

చ. తలిరుల నెల్లఁ గోసి కరతామరసద్యుతి వెల్లి గొల్పఁగా
నలరుల నెల్లఁ గోసి నఖరాంచలదీప్తులు పై నిగుడ్పఁ గాఁ
జిలుకల నెల్లఁ దోలి తమచిన్నియెలుంగులభంగిఁ జూపఁగాఁ
జెలువము క్రొత్తయై సతులచే వనవాటిక యొప్పె నయ్యెడన్. 32

గీ. తమయలంకారములకు నై తరుణు లెల్లఁ, గ్రొవ్విరులుఁ గ్రొంజిగుళ్లను గోసి రైన
దాన వనవాటికకుఁ బొల్పు తఱుఁగదయ్యె, దారయయ్యెంతు లాకయలంకారమగుట.

చ. అనుఁగువిటుల్ ప్రసూనముల నాభరణంబులు గూర్చ నేర్పుమై
ననువు తెఱింగి మేనికళ లారసి మర్మము లంటు వేళలన్
దనువులఁ బుట్టుచిత్తడుల దట్టము లై దిగజాఱెఁ గాంతలం
దనయము రేఖ లై వనవిహారపరిశ్రమఘర్మతోయముల్. 34

చ. పొలఁతులకున్ వనీవిహృతిఁ బుట్టిన సేదలు దొల్కరించినన్
వలిచనుఁగొండలం బొడమి వచ్చుపరిశ్రమవారివాహినీ
విలసనరేఖకున్ వళులు వీచిపరంపర లయ్యె నిమ్ననా
భులు తిరు లయ్యె వాలుకలపుంజము లయ్యె నితంబబింబముల్. 35

సీ. కుచకుంభభారభంగురమధ్యలతికలు పునరుక్తగుణయుక్తిఁ బూనుకొనఁగఁ
గరఁగినతిలకరేఖలతావులకుఁ జొక్కినట్లు కురుల్ నొసళ్లత్తుకొనఁగ
వ్రేఁకంబులకుఁ దోడువిరులవ్రేఁగులకల్మి వీడెపుఁగ్రొమ్ముళ్లు వెన్ను లొరయ
మఱి నిసర్గము లైనమందయానంబులు తోట్రుపాటున నింతతోడవు దాల్పఁ
గీ. దఱచుటూర్పులు తమకమ్ముతావిపలన, నలుల కలరులు గ్రోలినయరుచి మాన్ప
సతులు పుష్పాపచయకేళిఁ జాల నలసి, కోరి రాత్మల నంభోవిహారకేళి. 36

## జలక్రీడాభివర్ణనము.

చ. బడిబడిఁ బ్రాంతదీర్ఘికలఁ బద్మసుగంధిపయస్తుషారముల్
జడిగొన నల్లనల్లఁ బయిఁ జల్లుచు వాడినపువ్వుబోండ్లకున్
బడలిక లార్చి చేకొనియెఁ బ్రస్తుతు లయ్యెడ మందమారుతం
బెడరున నైనచుట్టమున కెవ్వరు సాటి జగత్త్రయంబునన్. 37

ఉ. పల్లవధూర్తుసన్నడుముపార్శ్వ మొగిం గుడిచంట నొత్తి దో
ర్వల్లరి మూఁపునం బెనఁచి వ్రాలి యురంబునఁ జెక్కుఁ జేర్చి సం
ధిల్లెడుచూడ్కితోన నడదేరఁగ నెచ్చెలిఁ బింతు సన్నిధిం
జెల్లె విదగ్ధతాగరిమ నేఁడెనెపంబునఁ బద్మనేత్రకున్. 38

చ. తరుణుల కింపులై తనరెఁ దత్సమయంబులయందుఁ బార్శ్వచా
మరములు గల్గి భర్తృముఖమారుతపాతము లుష్ణవారణో
త్కరములు గల్గి యైనఁ బ్రియకాముకహస్తపటావకుంఠముల్
పరిజన మున్న నైన నిజపల్లవదత్తకరావలంబముల్. 39

క. పద్మప్రకాశలక్ష్మీ, సద్మంబులఁ గంకణప్రశస్తముల దళ
త్పద్మాస్య లంతఁ గాంచిరి, పద్మాకరములనుబోనిపద్మాకరముల్. 40

చ. కొలఁకులు చేర వచ్చి యనుకూలతటంబుల నిల్చి ముగ్ధ లా
నలికులవేణు లయ్యెడ నిజావయవప్రతిబింబశోభగాఁ
దలఁపుచు నుల్లముల్ పొదలఁ దప్పక చూడఁ దొణంగి రందులో
జలజములన్ మృణాళములఁ జక్రయుగంబులగండుమీనులన్. 41

చ. గుఱి గడవన్ మరందములు గ్రోలి మదంబునఁ జొక్కి వల్లభ
న్మొఱఁగి పరాళినీరతికి మోదమునం జని తొంటియట్ల తా
నెఱుఁగక యుండఁ బద్మిపిరియింటికి వచ్చినభృంగపల్లవున్
నెఱతన మెన్నుపల్లవుని నీరజలోచన దాఁచెఁ గిన్పునన్. 42

సీ. కదళికలనుకంటె కరభంబులనుకంటె నిభకరంబులఁ బోల్ప నిప్ప డనువు
చక్రంబులనుకంటె శకటాంఘ్రులనుకంటె నిసుకతిప్పలఁ బోల్ప నిప్పు డొప్పు

గుచ్ఛంబులనుకంటెఁ గుధరంబులనుకంటె నిజజక్కవలఁ బోల్ప నిప్పు డొనరు
నద్దంబులనుకంటె నమృతాంశుఁడనుకంటె నెలదప్పిగమిఁబోల్ప నిపుడు దగవు

ఆ. నాఁగఁ బొలిచి రంగనలు నీటియాటల, కెచ్చరించి తటియు నెడఁ గొలఁకుల
తోయసంగమమునఁ దొడలను బిరుదుల, వలిచనుంగవలను వదనములను. 43

చ. అమితవిలాసినీకుచరథాంగకసంగతి గల్గ దీర్ఘికా
సముదయ మప్పు డాత్మగతచక్రయుగంబులఁ బాయఁ ద్రోచెఁ బ్రాం
తములకుఁ దత్ప్రదేశసవిధాతరళోర్మిభుజాపరంపరన్
దమ కొకమేలు గల్గ దిగఁ ద్రావరె యాశ్రితులన్ జడాశయుల్?. 44

చ. కువలయపత్రనేత్ర యొకకుంభము చాలుఁ దరింపఁ జేయ ని
క్కువముగ నీ కయత్నకుచకుంభయుగం బది గల్గ నీందనే
రవె? భయ మేల? రమ్మని కరంబుల నీడ్చినప్రాలుభీరువున్
వివృతభుజాంతరస్థలనివేశితఁ జేసెఁ బ్రియుండు నవ్వుచున్. 45

క. నిలువున నీఁదుచు రమ్మా, కొలఁదియ యన నేగి మునుఁగుకొలఁదిన యిరుచే
తులఁ బట్టి యెత్త భయమునఁ, గలకంఠి యొనర్చె విటునికంఠగ్రహమున్. 46

గీ. ఇంతిదరినుండి చివ్వన నెగసి యుఱుక, నురువుకొని నీరు వలయ మై పొరలి విరియ
నడుమ నుదయించెఁ జక్కనినగుమొగంబు, మధ్యమానాంబునిధిఁ జందమామవోలె. 47

గీ. ఒత్తిగిలి యీఁద నీటిపై నొంటిఁ దోఁచు, కొమ్మవదనాంబుజముపొంత కుచముగాంచి
కవదొఱంగినచక్రవాకం బొకండు, తోడిప్రియసతి యని ప్రీతిఁ గూడుకొనియె.

చ. అలరి యొకింతమాఱుమొగ మై యఱచేతుల నొగ్గికొన్న న
చ్చలమునఁ గాముకుండు పయిఁ జల్లెడునీటిమెఱుంగుఁదుంపరల్
చెలువచనుంగవన్ బొలిచెఁ జేరి తదీయనఖాంకచంద్రులన్
గొలిచి వినూతనద్యుతులు గొల్పెడుతారకపఙ్క్తులో యనన్. 49

క. అనులేపనములు గరఁగిన, చనుఁగవల నఖాంకురములు సతులకుఁ దగునా
ననపూర్ణవిధులవలనను, ఘన మై జాఱిపడి యొప్పుకళలో యనఁగన్. 50

ఉ. చల్లెడునీటిపై మలయజంబు గరంగిన నింతిచన్నులన్
బల్లవిలోరుకాంతి గనుపట్టెడుకెంపులు చూచుశంక మైఁ
బల్లవుఁ డొక్కఁ డివ్వలిసపత్ని మొగంబున నీరుతోడుతో
గల్లపడ న్వడిన్ బెడమొగం బగునట్లుగఁ జల్లె నార్చుచున్. 51

గీ. ధవుఁడు చల్లెడుకరవారిధార లెట్టు, లోర్చెనో కాని తరలాక్షియొద్ద సవతి
తత్కుచాఘాతఘట్టనోత్పతిత మగుచు, నొక్కతుంపర మైబడ్డ నోర్వ దయ్యె. 52

